# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము


సంపుటము 23 జూన్ 1980 సంచిక 6


చిత్రము : – విద్యుదుజ్జ్వల చైతన్య విభవమూర్తి



చందాదారులు గమనించండి!

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెలా పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు " ../-7-''80 అనియుండిన, మీ చందా జులై నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) జూన్ నెల 30 వ తేది 1980 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను

----: శ్రీ వారి కార్యక్రమములు :

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అవి తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్, ప్రశాంతినిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

సంవత్సర చందా 6 రూ ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలయును.

వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

## 18

వేదాలు ప్రపంచవాఙ్మయములోనే అత్యంత ప్రాచీనమైన సాహిత్యం. సాహిత్యమంటే ఈ నాడు ప్రొద్దు పోక వ్రాస్తున్న అర్థములేని, శీల రాహిత్యమైన, సత్యబద్ధముకాని, కట్టుకథలతో చేరిన కవిత్వముకాదు. వ్యక్తియొక్క పిత్తము కాదు. భారతీయ ఆధ్యాత్మిక జీవితములో వేద సాహిత్యం ఆత్మలాంటిది; ప్రాణమువంటిది. వేదాలలో అద్భుతమైన దివ్యశక్తికూడా ఉన్నది. విజ్ఞానవంతమైన మంత్రశక్తిసహితము ఇమిడియున్నది. తంత్రశక్తితోపాటు పవిత్రమైన దివ్యశక్తికూడా ఉన్నది. ఈ మహాశక్తిని ఉపయోగించి కార్యసాధన చేసేదే తంత్రశక్తి; దీనినే తంత్రం అంటారు. మంత్రాన్ని తంత్రాన్ని ఉపయోగించి మానవభౌతికవిజ్ఞానశక్తితో నడపించే యంత్రాలు, కర్మకాండ అంతా పవిత్రమైన నాలుగు వేదాలలో పూర్వపు భారతీయులైన మహర్షులు ఇమిడ్చారు.

ఈ సత్యాలను గ్రహించలేక వేదాలు అని అనగానే సనాతనులైన ఛాందసులు వల్లించు అర్థముకాని వ్యర్థమైన మంత్రాలని చాలామంది అధునాతనులు భావించుచున్నారు. అధునాతనులేకాదు. అర్థము నెరిగి వేదములను ప్రచారము చేయు పండితోత్తములని పేరు పొందిన పెద్దలు కూడా వాటిని స్వార్థమునకు వినియోగించుకొంటూ వాటి పవిత్రతను గుర్తించలేక అనుకూలము కొద్దీ వాటిని ఉపయోగించుకొంటూ వాటిని ఆచరణలో పెట్టలేక పోవుచున్నారు. అందువలనే అధునాతనులు వేదాలను విశ్వసించలేకపోతున్నారు. వేదవిహితులైన పండితవర్యులే వాటిని ఆచరణలో పెట్టక

సములేక, తమ పిల్లలకు వాటినిగురించి తెలుపక పోవుటయే అవిశ్వాసమునకు కారణమగుచున్నది. మరికొందరు అర్థము అయినా కాకపోయినా తప్పులతో కొంతమంది ఛాందసంగా బజారున నడుస్తూ వల్లెవేస్తున్నవారు కూడా ఉన్నారు.

భారతదేశములో ముఖ్యంగా జర్మన్‌దేశశాస్త్రజ్ఞులు ఈ మంత్రాలను వల్లెవేయకపోయినప్పటికినీ మంత్రాలలోనున్న మహాశక్తి బాగా కనిపెట్టిరి; గుర్తించిరి. వేదాలలో కొన్ని కొన్ని భాగాలను తీసికొనిపోయి, ప్రత్యేకంగా, ఓపికతో అనేక విధముల పరిశోధనలు చేసిరి. చూచిరి. అద్భుతవిషయాలను కనిపెట్టిరి. మానవాభ్యుదయమునకు అవసరమైన అన్నికళలూ, వేదాలలో ఉన్నాయని నిరూపించిరి. వేదాలనుండే ఉపవేదాలు బయలుదేరెను. ధనుర్వేదం, ఆయుర్వేదం, జ్యోతిర్వేదం, మొదలయినవి ఎన్నియో ఉన్నవి.

విశ్వామిత్రుడు గాయత్రీమంత్రమును కనిపెట్టెను. ఇది సూర్యశక్తికి సంబంధించినది. ఇది మహాశక్తివంతమైనది. మహామంత్రము. దీనిలో అత్యద్భుతమైన శక్తి యున్నది. ఆదిత్యహృదయం అన్న విద్యద్వారా విశ్వామిత్రుడు రామాయణములో రాములకు సూర్యశక్తిరహస్యాలను వివరించినట్లు రామాయణపాఠకులకు విదితమే! ఆ మంత్రాన్ని ఉచ్చరించి భక్తి శ్రద్ధలతో విశ్వసించి అపూర్వమైన అస్త్రాలను సంపాదించి మహాసంపన్నుడైనాడు విశ్వామిత్రుడు. విశ్వామిత్రుడు ఈ శక్తిద్వారా సృష్టికి ప్రతిసృష్టి చేసిన గొప్ప వైజ్ఞానికుడు. వైజ్ఞానికుడన్న కేవలము భౌతిక యంత్రాంగములతో అద్భుత శక్తిని కనిపెట్టువాడు కాదు. ఆధ్యాత్మికశక్తిని ఆధారముచేసికొని మంత్రద్రష్టుడై సాధనలు సలిపి శ్రద్ధాభక్తితో నిత్యాచరణలో ఈ శక్తిని నిత్యానుభూతికి తెప్పించుకోగలిగిన వానినే పూర్వము వైజ్ఞానికుడని పిలచెడి వారు. అయితే ఈ నాటి వైజ్ఞానికులు అంతో యింతో చదివి తెలిసికొని దానిని కొండంతచేసి ఆడంబరములతో అత్యద్భుతశక్తిని సంపాదించితిమని అహంకారముతో ఆకాశానికి ఎగురుచున్నారు.

ఇట్టి ఆడంబరాలు విజ్ఞానికి విరుద్ధ చర్యలు. వినయవిధేయులై ఇంకా, ఇంకా ఎన్నియో తెలిసికొనగలిగినవి ఉన్నవనియూ, ఇవన్నీ కేవలము దైవికశక్తిచే, అనుగ్రహముచే సాధ్యమగుననియూ, తలంచినవాడే విశ్వామిత్రుడు. అతనికి మించిన వైజ్ఞానికుడు మరొకడు లేడు. కాని ఇట్టి విశిష్ట సంపన్నుడు, విశాలహృదయుడు, అయిన విశ్వామిత్రుడు భారతీయుడైనప్పటికిని అట్టి మహర్షిని భారతీయులు స్మరించక విశ్వామిత్రుడు కనిపెట్టిన వాటిలో ఏ అణుమాత్రమో గుర్తించిన విదేశీయులను విశ్వసించి వారి చర్యలను వర్ణించుచుండుట విచారకరము. విదేశీయులే భారతీయవేదగ్రంథములను వివిధరీతుల పరిశోధనచేసి తెలిసికొనుచుండగా భారతీయుల తల్లియైన వేదమాతను భారతీయులే విశ్వసించక, పెంపుడు తల్లిని ప్రీతిగా ప్రేమించుచున్నారంటే, ఇదే ఆంగ్ల విద్యాభిమానముయొక్క ఫలమని భావించవచ్చు.

ఇంకా ఇంకా భారతీయుల మహర్షులయొక్క విజ్ఞానభిక్షను విధేయతతో విచారించిన, విమాన

నిర్మాణం, భరద్వాజ మహర్షిచే వ్రాయబడినది. మానసికశాస్త్రాధారంగా జరిగినవనికూడా నిరూపించినారు భారతీయులు. అంతేకాదు వైద్య శాస్త్రముకూడా భారతదేశమునందే అభివృద్ధి అయినది.

మొట్టమొదట ఈ విద్యను భరద్వాజమహర్షి మానవజాతికి ఉపదేశించాడు. ఆత్రేయుడనే ముని, అగ్నివేశునికి ఉపదేశించినట్లుగా ఆయుర్వేదము అంతా ఒక గ్రంథంగా వ్రాయబడి "చరక సంహిత" అను పేరుతో లభ్యమైనది. దీనిలో రోగలక్షణములు, చికిత్సావిధానములు, పిండోత్పత్తి ఇత్యాది అతిరహస్యమైన వెన్నియో తెలుపబడినవి. మూలికలతో నయము కాని వాటికి శస్త్రచికిత్సకూడా చేసెడివారు. వాటినిగురించి శుశ్రుతము అని ఒక గ్రంథమునుకూడా లిఖించిరి. శుశ్రుతుడను మహర్షి రచించెను కనుక 'శుశ్రుతము' అని పేరు పెట్టిరి. వాటిని ధన్వంతరి, నాగార్జునుడు మొదలైన మహర్షులు, మహానుభావులు వెలుగులోనికి తెచ్చిరి. ఇట్టి అనేక రహస్యములను వేదములద్వారా మహర్షులు కనిపెట్టి ఆచరించి భారతీయులకు అందించిన నీతిశాస్త్ర, ధర్మశాస్త్రపు మహానిధులు. మను ధర్మశాస్త్రం గౌతముని న్యాయశాస్త్ర స్మృతులవంటివి, ఎన్నియో ఉన్నాయి.

(సశేషము)

## నాలుగడుగుల దూరాన నాస్వామి !

నిలిచియున్నావు నాస్వామి !—నిశ్చలముగ
నాదు కన్నుల యెదుట నా—నందమూర్తి !
దివ్యతేజఃప్రభాదీప్తి—దేజరిల్లు
నీదుమూర్తిని నాచూపు-నిలుపలేదు.

నీవు కోచిన క్షణమున—నీరజాక్ష !
వేయివిధముల నామేను—వివశమయ్యె;
చెవులు వినరావు; మాటలు—చెప్పలేను;
కలము సాగదు; మనసు నా—కలవికాదు.

నిలిచియున్నావు ఎదుటనే—నిర్మలాంగ !
పొంగి వచ్చిన దివ్యవి—భూతి వోలె;
మనసు దిగ్భ్రాంతి చెందెను;—మమత లేదు;
తర్క—ముడిగెను; తన్మయ—త్వంబు కుదిరె.

విద్యుదుజ్జ్వలచైతన్య—విభవమూర్తి !
నీదు చిచ్ఛక్తి నాతనూ-నీరదమును
చీల్చుకొని చొచ్చె; ఆత్మను-చేదుకొనియె;
చిన్మయాకాశ మయ్యె నా—చిత్తమెల్ల.

ఏమి చెప్పుదు దేవ ! నే-నేమి యందు !
ఆత్మ అద్వైతమయ్యె నీ—వందుఁదోచి;
అహము నణగారె; అధ్యాత్మ—మావరించె;
దివ్యభావము వెలుగొందె—దివ్వెవోలె.

కదలలేనయ్య దేవ ! నా—కాయమెల్ల
బొమ్మయయ్యెను; చేతలు—వమ్ములయ్యె;
భావనలు లేవు; మాటయు—పలుకు లేదు;
మధుర మైనట్టి వింతస—మాధియేమొ !

నాలుగడుగుల దూరాన–నిలచినావు.
కారణంబొండు తప్పక–కలిగియుండు;
అస్మదీయాచ్ఛపుణ్యకా–ర్యంబొకండు
పండెననియెంతు; దర్శన–భాగ్య మబ్బె

కనుల పండువు గాగ నేఁ–గాంచుచుంటి
దివ్యమంగళ విగ్రహ–భవ్యహేల
కమలదళములఁబోలు నీ–కనులసౌరు
జలదసన్నిభమౌశిరో–జములతీరు.

పాదములనంటి దోగాడు–పసిడిగౌను
దివ్యవిమలానురాగంబు–తేటపఱచు
ఆర్తజనులను రక్షింప–నభయముద్ర
హస్తరాజీవయుగళి పై–నందగించు.

అరయ నీపైన కదలిక-లన్నిమాకు
'నీటి కొలదిగ తామర'-పాటియయ్యె;
నీవు కదలాడినంతనే-విద్ధమైన
దివ్యమారుత మొండు మా-దిక్కు వీచు.

నీవు నాకిచ్చినావు ని-ర్ణిద్రమైన
సౌఖ్యవారాశిచిత్కళా-చంద్రరేఖ;
నేనె కాదయ్య; నీ భక్త-నివహమెల్ల
నట్లెయనుకొనుచున్నది-యబ్బురముగ

సగుణమైనట్టి నీరూపు–సమ్ముఖమున
నరయఁగల్గిన మాపుణ్య–మగణితంబు
తనువుఁదాల్చిన విశ్వవి–ధాతవీవె !
మానవాకృతినందిన మా–ధవుడవు !!

ముగ్ధమోహనమైన నీ–మోముఁదమ్మి
నరసినంతనె యొకచోద్య–మావహిల్లు;
దివ్యలీలా విభావమ్ము–తీవరించి
పల్లవించిన కరుణగా–పరిణమించు.

నీవు చేయెత్తి యూపిన–నిశ్చయముగ
నెచటనో దూరదేశాల–నెఱుగు లెత్తి
ఆర్తిభజియించు భక్తుల–కభయముద్ర:
పరమ కల్యాణయాత్ర నీ–పాదయాత్ర !

స్వామి! భవదీయ దర్శన–సాంద్రమహిమ
ఆత్మపరమార్థశక్తి స–మగ్ర మగుచు
వ్యక్తమైనట్లు తలపించు–భక్తతతికి:
అనుభవంబున తలమున్క–లగును మాకు !

కదలిపోనుంటివా దేవ!–సదయమూర్తి !
వినతి నందించు నంజలి–వెంటఁగొనుము !
మఱల నొకనాడు నాదైన–మనవి వినగ
చేరదీయగ జ్ఞాపక–చిహ్నమగును.

ఆంగ్లమూలం,
డగ్లస్ జేమ్స్ మహర్.

జి. వి. సుబ్రహ్మణ్యం

# ఆస్ట్రేలియాలో సాయి మహిమ

నాలుగు సంవత్సరాల క్రితం, నా రెండవ పుస్తకము "సాయిఅవతార్"ను అచ్చువేయుటకు ముందు దానిని టైపుకొట్టి సిద్ధపరచే నిమిత్తము మనిషిని వెదకినపుడు, నాకు పెర్లో హారిసన్ అనే ఆమె పరిచయమయినది. ఆమె సిడ్నీ విశ్వవిద్యాలయమునందు వైద్య సంస్థయొకటికి సెక్రటరీగా ఉద్యోగముచేసి, రిటైరయి ఇంట్లో ఉండి, 'టైపు' పనిచేసి అంతో ఇంతో డబ్బు సంపాదించి కాలక్షేపము చేస్తూన్నది. ఆమె నాపుస్తకమును తీసికొని, 'టైపు' చేయమొదలిడినది. దానిలోని విషయములు, విచిత్రసంగతులు, అవతారమహిమలు ఆమెకు నచ్చలేదు. ఆమె తల్లిదండ్రుల మతతత్త్వములు కానీ, వారి ఆచరణలుకానీ, ఆమె ఎన్నడూ ఎరుగదు. ఆమె అక్షరాలు చూచుకొని 'టైపు' పని కొనసాగించునది; పదాల అర్థము ఆమెకి అక్కరలేదు...అయిననూ....

ఆమె మనుమరాలు. తొమ్మిదిసంవత్సరాల వయస్సుగల, 'మాయన్' అప్పుడప్పుడు ఆమె దగ్గరకూర్చొని, నాహస్తప్రతి పుటలుత్రిప్పి, చదివి వినిపించి, ఆమెకి సాయముచేస్తూండేది. ఆపాపమాత్రము, తాను చదివినదంతా నిజమని నమ్మినది.

మొదటి మూడునాలుగు అధ్యాయములు 'టైపు' అయ్యేలోపల, 'మాయన్'ను రక్తపరీక్ష కొరకు, ఆస్పత్రికి తీసికొనిపోయిరి. పాపమా పాప బలహీనతతో బాధపడినది. పరీక్షచేసిన డాక్టరు తక్షణమే 'మాయన్' తల్లికి ఫోన్ చేసి, పిల్లని బడినుంచి ఇంటికి తీసికొనివచ్చి, ఎముకలలోని జీవరసముతీసి పరీక్షించిరి పోర్టు చేసే స్పెషల్ డాక్టర్లకు చూపించాలి, అన్నాడు. రక్తములో ఎఱ్ఱ జీవాణువులు ఆరోగ్యవంతమైన పాపకు ఉండవలసిన సంఖ్యకన్న చాలాతక్కువ; సగముకూడ లేవు. తెల్లటి జీవాణువులు ఇంకా తక్కువ. కావలసిన ప్రమాణము 30 శాతము కూడలేదు. ఇవిరెండూ, ఇట్లుండగా, ఎముకలలోని జీవరసము ఇంకా అపాయమని తేలినది. పదిహేను భాగములో ఒక భాగముకూడ ఆమెలో ఆజీవరసము లేదు.

'ప్రెడ్నిసొలోన్' మరి 'ఫ్లుఓక్సిమెస్తరోన్' అనే రెండు మందులువాడాలి. అయితే, ఒకటి రెండు నెలల తరువాత, ఆ మందులవలన జరిగే మార్పులు గోచరమగును— ఆ పాపకు బట్టతల, మీసములు, గడ్డములు, లావు, పొట్టితనము మున్నగువాటిని తప్పించుటకు వీలు లేదన్నారు డాక్టరులు. ఎముకల పరీక్షకుకూడ సూదిమందు ప్రయోగము అప్పుడప్పుడు చేస్తూండాలి అనివారు సలహాఇచ్చిరి. దీనిలో ఇంకొకఇబ్బంది: 'మాయన్'కు సూదిమందు పనికిరాదు.

ఇన్ని కష్టాలకు ఓర్చిననూ, ఫలితము శూన్యము. నాలైదు ఏండ్లు మాత్రమే ఆమె బదుకు. తాను బాధపడుతూ, ఇతరులకు బాధకలిగిస్తూ ఆ పాప జీవించవలసినదే.

మాయని అమ్మమ్మ పెర్లో చెప్పింది, "సత్యసాయి బాబావారినిగురించి నేనెందుకు అన్ని పేజీలు టైపు చేశాను" అని. ఇది కూడ వారి సంకల్పముతోనే జరిగిందో ఏమో? మర్ఫెట్ దంపతులకు 'మాయన్'పరిస్థితి

ఫోన్ చేసినాను. వారిరువురూ విభూతితో పరుగెత్తి ఇంటికి వచ్చిరి. రోగివిశ్వాసము, నా కరుణ, రెండూ చేరినప్పుడు, జబ్బునయమగును, అని బాబావారు చెప్పుదురు. 'మాయన్'ను అడిగితే, "ఓః నేను నమ్ముతాను, నిజముగా" అనింది. నిర్మల నిశ్చల భక్తి 'మాయన్'ది. తాతగారు జాక్ అనే వాడు," నయమైన తక్షణమే నేను బాబా సన్నిధిచేరి కృతజ్ఞత నర్పిస్తాను" అన్నాడు. పేర్లోలో మాత్రము అంత మార్పు కనబడలేదు. మాయన్ తల్లికి, "ఏదో! చూస్తాం ఏదానినుంచైనా నయమైతే చాలు" అనే అభిప్రాయము. మేమిరువురూ, "స్వామి! పిల్లకు హఠాత్తుగా ఎన్ని బాధలు. ఎంత నొప్పి, మందులవల్ల ఎంత భయంకర విపత్తు" అని విలపించినాము.

మాకెదురైన సమస్యలలో మొదటిది-మందులు వాడేదా? విభూతి చాలునా? అనేది. కొంతమంది మందులు వాడమంటారు. విన్నాను; కొంతమంది, మందులు! మందులెందుకు? విభూతినే వాడండి అంటారు; దానినీ విన్నాను. ఆలస్యంకూడదని డాక్టర్ల ఒత్తిడి. సరే! సమయానికి, లినెలో పెన్రోస్ అనే భక్తురాలు (ఆమె ఇంటిలోనే మేము మొట్టమొదటసారిగా సాయిభజన ఏర్పాటు చేశాము) స్వామి సన్నిధికి వెళ్ళుతుంది అనే వార్త తెలిపినది. ఆమెతో 'మాయన్' ఫోటో ఒకదానిని, మందులవాడేదా, విభూతి ఇచ్చేదా అనే సందేహమునకు స్వామి సమాధానమేమి అని ప్రార్థించే ఒక ఉత్తరమునూ, పంపినాము. ఇంటర్వ్యూ దొరికిననాడే ఆమె మాకు ఒక లెటర్ వ్రాసినది. "ఫోటో చేతిలో పట్టుకొని, స్వామి దానిపై కృపాదృష్టిని ప్రసరించారు. మందులు వద్దన్నారు. విభూతి నీటిలో కలిపి దినమూ రెండు పర్యాయములు త్రాగితే చాలు" అన్నారు. కరుణామూర్తి, కనికరించి "సాయిబాబా నాకు మందులక్కరలేదన్నారుకదా? ఇంకపైనేతీసుకోను అని మాయన్ పట్టు పట్టింది. ఆ ఇంటిలో ఎవరూ స్వామిని చూడలేదు. అయిననూ, ఎంత శ్రద్ధ వారి ఆజ్ఞానుసారం నడుచుటకు! అని నేను ఆశ్చర్యపడ్డాను.

మీ ఇంటిలో స్వామి పటముమంచి అలంకరించి ఆదరించి ఆరాధించి, భజనలు సలిపితే బాగుండును, అని మేము సలహా ఇచ్చినాము. డాక్టర్లకు ఇది ఏమియు తెలియదు. మందులు వాడుతున్నామనే వారి నమ్మకము. కాబట్టి, నెలకు రెండు సార్లు మాయన్‌ను వారి దగ్గరకు తీసుకొనిపోయేది, వారు పరీక్షించి," మంచిది. ఎంతో మేలు. మందులు బాగా పనిచేస్తున్నవి. దానినే వాడండి" అన్నారు. ఇంకపై రెండు నెలల కొకసారి పరీక్షించిన చాలు," అన్నారు తరువాత రక్తములోని ఎఱ్ఱ జీవాణువులు తెల్లటి జీవాణువులు ఎన్ని ఉండవలెనో అన్ని అంతత్వరలోనే ఉత్పత్తి అయినవి.

ఎముకల అంతర్భాగమందు ఉత్పత్తిఅయి రక్తమును చేరే రసముమాత్రము చాలా నిదానముగా పెరిగినది. పరీక్షచేసినప్పుడంతా 10,000 పెరుగును. కానీ, అట్టి అభివృద్ధి చాలదు; అని డాక్టర్లు తెలిపిరి. మాయన్ చెల్లెలి పరీక్షజేసి, ఆ పిల్ల ఎముకను కొంత మాయన్ ఎముకలో ఆపరేషన్‌ద్వారా చేర్చాలి అని ఆదేశించారు.

స్వామిదయవలన, ఆ సమయానికి సరిగ్గా మరొకరు పుట్టపర్తికి బయలు దేరిరి. వారితో, డాక్టర్ల వత్తిడి విషయం స్వామికి తెలుపుమని ప్రార్థించినాము. ఆపరేషన్ అక్కరలేదు, అనే సమాధానమును అనుగ్రహించారు, స్వామి. మాయన్‌ను ఆసుపత్రి తీసు

కొనిపోతే రసాణువులు మామూలుగా ఎన్ని ఉండవ లెనో ఆ సంఖ్యనూ మీరిందని తెలిపింది; 174,000 కి ఎక్కినది స్వామి దయవలన.

మాయన్ ఇపుడు ఆరోగ్యముతో ఆడుతూ పాడుతూ స్వామి అవతారతత్వమునకు ప్రత్యక్షనిదర్శనముగా నున్నది. ఆమె జబ్బు విభూతితోనే నయమగుట వలన, ఆమె కుటుంబమంతా భక్తులైనారు. వారి మిత్రులు బంధువులుకూడ దేవుడు, భక్తి, సత్సంగము సత్సంప్రదాయములు వీటిలో గాఢమైన విశ్వాసము కలిగి యున్నారు.

హవార్డ్ మర్ఫెట్

# విశాలదృక్పథం

సకలవిద్యలునేర్చి—సభ జయించగవచ్చు
శూరులై రణమున—పోరవచ్చు
రాజరాజై పుట్టి—రాజ్యమేలగవచ్చు
హేమ భూదానముల్—హెచ్చవచ్చు
గగనంపు చుక్కలు—గణియింపగా వచ్చు
జీవరాసుల పేర్లు—చెప్పవచ్చు
అష్టాంగవిద్యల—నన్ని నేర్పగవచ్చు
చంద్రమండలయాత్ర—సలుపవచ్చు
కాని దేహేంద్రియాదుల—కట్టిపెట్టి
మనసు నిల్పియునంతర్ము—ఖముచేసి
అనవరతము నిశ్చలమైన—యాత్మలగుచు
విలువగా లేరు మానవుల్—నియతితోడ.

ప్రేమస్వరూపిణులారా! విద్యార్థినులారా!

దేహము, మనస్సు, బుద్ధి, ఇంద్రియములు ఈ నాల్గింటితో సమ్మిశితమైన స్వరూపాన్ని మానవులవి భావిస్తున్నాం. కాదు కాదు. మనస్సు మనము ధరించిన ఒక ఉపాధి. ఇంద్రియములు మనము ధరించిన ఒక ఉపాధి. ఈ దేహమూ ఒక ఉపాధి. బుద్ధి కూడ ఒక ఉపాధి. మనము ధరించిన ఉపాధిని 'మనము', అని చెప్పుటలో అర్థంలేదు. మనము వేరు; మనము ధరించిన, దుస్తులువేరు, అయినట్లుగా ఈ ఉపాధులు వేరు, మనంవేరు. ఏనాడు ఈ విభాగయోగమును మనం గుర్తించి వర్తించడానికి ప్రయత్నింతుమో ఆనాడేమనతత్త్వము, మనగమ్యము అర్థం చేసుకోవ టానికి వీలవుతుంది.

దేహం! ఏమిటి ఈ దేహం? ఇది చైతన్యముతో కూడినటువంటిదా? లేక జడమైనదా? జడమైతే పెరుగుట క్షీణించుట, వర్ధించుట, నాశనమగుట జరుగుచున్నదే! జడపదార్థమునందు ఈ షడ్వికారములు ఎట్లు కలుగు చున్నవి? "నిత్యము మనము హాస్టలు అంతా ఊడు స్తున్నాం. ఊడ్చి, చెత్తను తీసికొనిపోయి ఒక గుంతలో వేస్తున్నాం. ఒక నెల అయ్యేటప్పటికి ఆ గుంతలోని చెత్తపెద్దగా కుప్పమాదిరి పెరిగిపోతుంది. ఈ దిబ్బను మనం జడమంటున్నామా? చైతన్యమంటు న్నామా? ఇది కేవలము జడమే! నిత్యమూ ప్రోగు చేయటంచేత ఈ దిబ్బ ఏరీతిగా పెరిగిందో అదే విధ ముగనే నిత్యము ఈ దేహములో తిండి తీర్థాదులనే

చెత్తను వేయటంచేత ఈ దిబ్బకూడను పెరుగుతున్నది. ఈ తిండితీర్థాదులనే చెత్తను ఈ దేహమనే దిబ్బకు చేర్చుకుండిన దేహం కూడను క్షీణిస్తుంది. ఏతావాతా ఈ దేహం జడమేకాని చైతన్యం కాదు.

దహ్యతీతిదేహః' దహింపబడేటటువంటిది దేహం. నిత్యజీవితమునందు తెల్లవారినది మొదలు రాత్రి పరుండునంతవరకు చింతలచేత ఈ దేహాన్ని దహింప జేస్తున్నాం. ఈ చింత మన జీవితంతో కూడిన ఉపాధిని దహింపజేస్తుంది. చితి, మరణించిన తరువాత కండలు, మాంసము, ఎముకలు, చర్మము ఇత్యాది స్వరూపాన్ని దహింపజేస్తుంది. కనుక మనదేహం దహింపబడేటటువంటిది. కనుక జడమేకాని చైతన్య స్వరూపమైనటువంటిదికాదు. దీనికి మరొకపేరు శరీరము. 'శీర్యతే ఇతి శరీరః' జీర్ణించిపోయేది కనుక ఇది శరీరము. పుట్టినపుడు మాంసపుముద్దవలె పుడు తున్నది. బాల్యంలో అతికోమలంగా కనిపిస్తున్నది. యౌవనంలో ఆకర్షణీయంగా ఉంటుంది. వృద్ధాప్యంలో వికారం చెందుతుంది. ఇది నిరంతరము జీర్ణించేటటు వంటి స్వరూపాన్ని ధరించింది. కనుకనే దీనికి శరీరము, అనిపేరు.

"దేహో దేవాలయప్రోక్తో జీవోదేవస్సనాతనః" మరికొంతమంది దీనిని ఒక క్షేత్రముగా భావిస్తూవచ్చారు. క్షేత్రమనగా—దివ్యమైన, భవ్యమైన, పవిత్రమైన దైవస్థానము. "నాదేహము నీ నిలయము. నా జీవము నీకు అరాధనము" అని యిప్పుడు వీరు పాటచెప్పారు. నీ నిలయము అనుకున్నపుడు ఆ నిలయంలో తాను నివసించేవాడు అని మనకు స్పష్టమవుతుంది. అయితే, ఈ దేహము దేవుని నిలయమైనపుడు ఈ నిలయాన్ని మనం ఎంత పవిత్రంగా ఉపయోగపెట్టుకోవాలి? ఎంత దివ్యమైన మార్గంలో దీనిని అనుభవింపజేసికోవాలి !

ఇంక ఈ దేహాన్ని ఏవిధంగా పరిశుద్ధం చేస్తున్నాం జలముతో, సబ్బుతో, సుగంధములతో, అనేకపరిశుద్ధ ద్రవ్యములచేత ఈ శరీరాన్ని పరిశుద్ధంచేసికుంటున్నాం. శరీరం పరిశుద్ధం అయినంత మాత్రమున మనకు లభించే ఫలితం ఏమిటి? కొంత ఆరోగ్యమును, రోగనివారణ చేసుకోవచ్చు. అంతేకాని మానసిక రోగం నివారణచేసికోటానికి వీలుకాదు. దేహమును అనేక సుగంధములచేత కప్పి, తద్వారా సుగంధాన్ని అందించే దివ్యరూపంగా మనం తయారు చేసికున్నప్పటికి మానసికంగా బుద్ధి, వాక్కు పవిత్రం గావించుకొన కుండిన పరిపూర్ణత్వం అందించ నేరదు.

జలముచేత దేహమును, సత్యముచేత వాక్కును, విద్యాతపస్సులచేత మనస్సును, జ్ఞానముచేత బుద్ధిని పరిశుద్ధం చేసికోవాలి. "విద్యాతపోభ్యాం భూతాత్మా" విద్య యనగా ఏమిటి? కేవలం గ్రంథపరిచయమా విద్య? వ్రాయటం చదవటమా విద్య: కాదు కాదు. విద్య ప్రకాశాన్ని అందించే దేదీప్యమానమైన జ్యోతి. అజ్ఞాన అహంకారములను దూరం గావించి వినయ విధేయతలను అందించేదేవిద్య. అలాంటివిద్యను అభివృద్ధి గావించుకొని తద్వారా మనస్సును పరిశుద్ధం చేసికోటానికి ప్రయత్నం చెయ్యాలి.

తపస్సు అనగా ఏమిటి? తలక్రిందుబెట్టి కాళ్ళు పైకిపెట్టి కందమూలాదులు భుజించి కాయమును శుష్కింపజేసికోవటమా? కాదు కాదు. మనస్సు, వాక్కు, కాయము ఈ మూడింటి ఏకత్వాన్ని మనం చేకూర్చు కోవాలి. అప్పుడే దీనిని తపస్సు అనుకోవచ్చు. మనసు నందు తలచేది, మాటలోచెప్పేది, క్రియలో ఆచరించేది తపస్సు. మూడింటి ఏకత్వాన్ని అనుభవించేదే నిజమైన తపస్సు. మనం ఇల్లు వాకిలి వదలిపెట్టి, ఆలుబిడ్డల వదలిపెట్టి, బాధ్యతలను తిరస్కరించి, అరణ్యానికి వెళ్ళి ఏదో భగవంతుని ధ్యానించటం కాదు.

దేవుడనగ వేరు—దేశమందునలేదు
దేవుడుండు తనదు—దేహమందె
పాపమనగ వేరు—పరదేశమునలేదు
తానుచేయు పనుల—తగిలియుండు.

పాపముకాని, పుణ్యముకాని, దైవముకాని, దయ్యము కాని మనయొక్క హృదయములందే ఉంటుంది. దైవము చేరెనా, దయ్యం ఉండదు.

ధర్మమెచటనుండు నచట—దైవముండు
ధర్మమెటనుండదో నచట—దయ్యముండు

దయ్యమునకు, దైవమునకు కేవలము ఒకే స్థానము. ఇది ఒక musical chair వంటిది. ఒకరు అందులో ప్రవేశిస్తే మరొకరువచ్చి అందులోకూర్చో టానికి వీలుకాదు. కనుక దైవానికి హృదయమనే chair నిరంతరము అట్టే పెట్టి ఉండాలి. కాన ఇది దైవమందిరం అనుకోవటంలో, హృదయమును పరి శుద్ధంగావించుకోటానికి ఈ జ్ఞానము, ఈ విద్యాతపస్సు, ఈసత్యము ఎంతైనా సహాయకారులుగా ఉంటున్నవి. కాన జడమైన ఈ దేహాన్ని చైతన్యవంతమైన దైవ త్వానికి నిలయంగా ఏర్పరచుకునే నిమిత్తమై మనమీ విద్యలు నేర్వాలి.

భౌతికవిద్యలు అవసరమే: నిత్యజీవితంలో మనకీ విద్యలు అవసరమే: కాని జీవనోపాధి, జీవిత పరమావధి—ఈ రెండింటియొక్క ఏకత్వాన్ని అను భవించటానికి తగిన ప్రయత్నంచేయటమే సరియైన విద్య. దేహమనే దానిని మనం ఈనాడు పోషించు కుంటున్నాం. అలంకారములు చేసికుంటున్నాం. అన్ని విధాల ఆకర్షణీయంగా ఉంటున్నాం. కాని దేని నిమి త్తము: లోపల ఇంటిలో ప్రవేశించిన దేవుని నిమితం.

మొదటి ఉపాధి దేహము. రెండవ ఉపాధి ఇంద్రి యములు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ తత్త్వాన్ని మనం చక్కగా పసికట్టాలి. ఏ ఇంద్రియమును దైవము ఏ కార్యనిమిత్తమై మనకు అందించాడో ఆ కార్యమును మాత్రమే ఆ ఇంద్రియముద్వారా మనం ఆచరించాలి. భిన్నకార్యములు ఈ ఇంద్రియములద్వారా ప్రవేశపెట్టితిమా, భిన్న ఫలితములకుగురి కావలసి వస్తుంది. ఎట్లు: కన్నుచూడగలుగుతూంది. చూచేదానికి మాటాడే శక్తిలేదు. నాలుక మాటాడుతూంది. కాని దానికి చూచేశక్తి లేదు. ఒక్కొక్క ఇంద్రియమును ఒక్కొక్క కార్యనిమిత్తమై దైవము 'పరిమితి'లో నిర్ణయించాడు. మాటాడే నాలుకమాటాడగలదు. కాని ఎట్టిమాటలు: మంచిమాటలా: చెడ్డమాటలా: ఇతర లను బాధించేమాటలా: ఆనంద పెట్టేమాటలా: లేక పశువా అనిపించే మాటలా: పశుపతి అనిపించే మాటలా నిర్ణయం చేసుకోవాలి. దీనినే ఉపని షత్తులయందు మాత: అనిచెప్పారుమాత్ర: అనగా పరిమితి అనిఅర్థం.

ముక్కుతో, మంచివాసన చూసికొటానికే ముక్కు అందించాడుగాని నశ్యం పీల్చుకోటానికి అందించలేదు. సుగంధాన్ని అందుకునే నిమిత్తమై అందించిన నాసి కను విరుద్ధమైన మార్గాన్ని అవలంబింపచేసినపుడు మన ఆరోగ్యం క్షీణిస్తుంది. ముక్కు అపవిత్రమై పోతూంది. భగవన్నిర్ణయానికి విరుద్ధంగా పోతూంది.

ఇక కన్ను. చూడవలసినది కన్ను. కాని దేనిని చూడటము: విరుద్ధమైన వికారాలు చూడటమా: లేక అసభ్యమైన దృశ్యాలుచూడటమా: కాదు కాదు. దృశ్యసం బంధమైన సౌందర్యాన్ని, దైవానందముతో తులతూగి, మైమరచి, తన్మయులై, ఆనందంతో ఉన్మత్తులైన వ్యక్తు లను, ఈదివ్యమైన భావాలు చూచే నిమిత్తమై కన్నులు

అనుగ్రహించాడు. అలాంటికన్నులను పాపపు పనులు పాపపు కార్యములు పాపపుదృశ్యములు చూడటానికి ప్రవేశపెట్టినపుడు కన్నులకు నిర్ణయించినదానికి విరుద్ధంగా నడచినవారమవుతాము. అప్పుడు కన్నులు అపవిత్రమైపోతాయి. అదేవిధముగనే చెవులు, చర్మము, నోరు ఇవన్నీ కూడను విరుద్ధమైన మార్గంలో ప్రవేశపెట్టటంచేత అపవిత్రమైపోతాయి.

నాలుక. నాలుగురకములైన పాపాలు సంపాదించి పెడుతుంటుంది. మీకు అనేకపర్యాయములు చెప్పాను. అసత్యమాడటం, ధర్మవిరుద్ధం. ఇదిమొదటి పాపం. ఒకరిపైన ఒకరు చాడీలు చెప్పటం రెండవ పాపం. అతిభాష మాట్లాడటం మూడవ పాపం. పరదూషణ చేయటం నాల్గవపాపం.

పరులను దూషించకూడదు. దేనికోసం దూషించకూడదు? పరమాత్మ సర్వులయందు ఉంటున్నాడు. "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః". అని భగవద్గీత చెప్పింది. మమైవాంశో—అన్నిజీవులూ నా అంశమే. అన్ని జీవులయందు ఉంటున్నది నా అంశమే. కనుక పరులను దూషించటంచేత పరమాత్మను దూషించిన వారవుతారు.

ఇంక చాడీలు. వీరిపైన వారు, వారిపైన వీరు ఈ విధంగా చాడీలు చెప్పుకోకూడదు. ఇదికూడను ఒక పాపం. ఇది నాలుకకు నియమించిన నిర్ణయంకాదు.

ఇక అసత్యమాడటం. అసత్యం మరింత పాపం. సత్యస్వరూపుడు భగవంతుడు; Truth is God అంటున్నాం, కాని Untruth ను God గా ఆరాధన చేస్తున్నాం. కనుక అసత్యమనేది పెనుభూతంతో సమానమైనది; మహా పీడాకరమైనది.

ఇంక మనం చేయు అతిభాష. అతిభాష మతిహాని. మీకు అనేకపర్యాయములు చెప్పాను. అధికంగా మాటాడటంచేత జ్ఞాపకశక్తి నశించిపోతుంది పని చేసే power మనలో క్షీణించి పోతుంది. ఇవిరెండూ మీకు తెలియకుండా పోవచ్చును. మూడవది మాత్రం అందరకు తెలుసు. ఎవరైనా అతిగా మాట్లాడేవారు మన దగ్గరకు వచ్చినపుడు 'వచ్చిందిరా వాగుడు కాయ' అని తప్పించుకోవటానికి ప్రయత్నం చేస్తుంటాము. దేనివల్ల? ఆమె మాటలు నయాపైసా ఇచ్చి మనం కరిపించుకుంటే నాలుగు వేలు ఇచ్చినా వదిలించుకోటానికి వీలుకాదు. ఏదో అనవసరమైనవంతా లోకాభిరామాయణమంతా తెచ్చి మన దగ్గర చెప్తుంటుంది. ఆ అమ్మాయి ఇట్లా, ఈ అమ్మాయి అట్లా అని. మంచిని పెంచుకొని, చెడ్డను తీసివేసుకుని, పవిత్రతను అభివృద్ధి చేసుకోటానికి వచ్చిన మనం ఇతరుల విషయమంతా తలలో ఎందుకు చేర్చుకోవటం? చాడీలు చెప్పటంగాని, అతిగా వాగటంగాని ఈ రెండు సన్నిహితసంబంధాన్ని చేకూర్చుకుంటాయి. ఈ రెండూ మహాస్నేహితులు.

"జిహ్వే రసజ్ఞే మధుర ప్రియే త్వం సత్యం హితం త్వాం". మనం సత్యం చెప్పినాకూడను ఉద్రేకంగాకాని, నిరుత్సాహపరచేటటువంటిదికాని, బాధలు పెట్టే దానిని కాని చెప్పకూడదు. "సత్యంబ్రూయాత్, ప్రియంబ్రూయాత్" సత్యం చెప్పాలి. ప్రియంగా ఉంటుండాలి. "న బ్రూయాత్ సత్యమప్రియం" సత్యము అప్రియమని మనం అసత్యం చెప్పటానికికూడ ప్రయత్నం చేయకూడదు. అందువల్లనే భగవద్గీతలోపల "అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రయహితం" అన్నారు ఈవిధమైన వాక్కుల చేత మనం నాలుకను పవిత్రంచేసికోవాలి. కనుకనే ఈ కరణములకంతా మాత్రః అని పేరు పెట్టారు. మాత్ర—అనగా కొలత. కొలత—అంటే ఆమె కొంచెం పొట్టిగా ఉంది అంటే ఆమెయొక్క రూపాన్ని ఏది కొలత

వేపింది: కన్ను. కనుక కన్ను కొలత బద్ద. ఈ నాడు మా వార్డెనుగారు పప్పుచేశారు. పప్పులో కొంచెం ఉప్పు తక్కువయింది అన్నప్పుడు. పప్పులో ఉప్పు తక్కువయిందనే కొలత వేసినది నాలుక. అదే విధముగనే ప్రతిదానికి కూడను ఒక్కొక్క యింద్రియం కొలత వేస్తుంది. ఇదిమంచి, ఇదిచెడ్డ. ఏవైన మంచి పాటలు విన్నపుడు ఆహా ఎంతశ్రావ్యంగా ఉంటున్నాయి అంటున్నాము. ఏదైన అపస్వరంగా ఉంటే అబ్బబ్బ వినడానికి యింపుగా లేదు అంటున్నాము. దీనిని ఏది కొలతవేసింది ? మనకర్ణములే. కనుక ఇంద్రియములు కొలతవేసే పరిమితిలో వానిని ఉపయోగపెట్టుకోటం ఇంద్రియముల యొక్క సార్థకత. ఇంద్రియములు పెడమార్గం పట్టటం చేతనే మానవత్వం. బుద్ధి మరుగుపడిపోతుంది.

"సకల విద్యలు నేర్చి సభజయించగవచ్చు" "ఆహా గొప్పగా ఉపన్యాసం యిచ్చాడురా' అని పేరు తెచ్చుకోవచ్చు. "రాజరాజై పుట్టి రాజ్యమేలగవచ్చు. హేమ, గోధానములు చేయవచ్చు" బంగారం దానంచేయవచ్చు, గోదానం చేయవచ్చు. భూదానం చేయవచ్చు, సర్వ దానములు చేయవచ్చు. కర్ణుడు తన కుండలాలే కోసి యిచ్చేశాడు. చర్మాన్నికూడా కోసియిచ్చేశాడు. కాని ఏమి ప్రయోజనం ? ఎక్కడ ఉంటుంది దీనికీలకం. గమ్యం, మూలాధారం. అని విచారించుకుంటే హృదయమునందే ఉంటుంది.

మనస్సుకు అంతఃకరణ అని పేరు. మనస్సు ఎట్లాంటిది ? ఇది ఒక ఉపాధి—నిరంతరం మనము చేసే "మననాత్ ఇతిమనః" అన్నారు. "సంకల్ప వికల్పాత్మకం మనః" అన్నారు. ఎవరితోనూ మాట్లాడకుండా ఉండవచ్చు. కాని మీసంకల్పాలు మాత్రం యిష్టంవచ్చినట్లు మాట్లాడుతుంటాయి. రాత్రి నిద్ర వచ్చేంతవరకు మీతోమీరే మాట్లాడుకుంటున్నారు. అదే సంకల్పం. ఒక్కొక్క పర్యాయం దీనివేగం అధికం కావటంచేత అస్తవ్యస్తమై పోతుంటాది. దీనివల్లనే అనేకమంది ఈ నాడు విద్యాబోధకులు, విద్యాధికారులు, విద్యార్థులు కూడను పిచ్చివారుగా తయారై పోతున్నారు 'ఏది చెయ్యాలి ? ఏదిచెయ్యకూడదు ? ఏదిచూడాలి? ఏది చూడకూడదు ? ఏది చెడ్డది ? నిర్ణయించుకునే శక్తిసామర్థ్యములు వారిలో తగ్గిపోతున్నాయి. కారణమేమిటి ? వారిలో ఈ సంకల్పముల యొక్క వేగం తీవ్రమై పోవటంచేత ఈ దుస్థితి। కానీ, ఈ సంకల్పాలకు మనము ఏ మాత్రంకూడను వేగాన్ని అందించకూడదు. పరమశాంతంతో ఉంటుండాలి. ఏవరు ఏమి అన్నప్పటికీ, దూషించినప్పటికీ, భావించినప్పటికీ అన్నిటికీ సహనభావం కలిగి ఉండాలి.

తపస్సులు మూడురకములుగా ఉంటున్నాయి. మనస్సుయొక్క తపస్సు ఒకటి. దేహతపస్సు ఒకటి, వాక్తపస్సు ఒకటి. ఈ దేహ తపస్సులోనే విధ విధములైనటువంటి తపస్సులున్నాయి. గురువులను, దైవమును. పెద్దలను ఆరాధించి, వారిని ఆశ్రయించి వారిని ప్రసన్నులను గావించుకొని వారియొక్కబోధలను శ్రవణం చేసి. వారియొక్క ఆజ్ఞను శిరసావహించి ఆచరణలో ఉంచటం చేత వారిఅనుగ్రహానికి పాత్రులమైపోతున్నాము. వారియొక్క ఆశీర్వాదాలను అందుకోగలుగు తున్నాము. ఇది ఈ దేహంతో చేసేటటువంటి మొదటి తపస్సు. పెద్దలను దర్శించటము, వారియొక్క బోధలను వినటము. విన్నటువంటి దానిని ఆచరణలో పెట్టటము ఇలాంటివంతా దేహంతో చేసే తపస్సు. రెండవ తపస్సు అంతర్బహిశ్శౌచము. దేహాన్ని ఏవిధంగా స్నానం చేసి శుభ్రంచేసుకుంటున్నామో అదేవిధంగానే పరిసర ప్రాంతములు కూడ పరిశుద్ధంచేసుకోవాలి. మూడవది బ్రహ్మచర్యం. అనగా పెండ్లిచేసుకోకుండా

ఉండటం మాత్రమే కాదు. పవిత్రమైన భావం, నిర్మల మైన చిత్తం, నిస్వార్థమైన, కపటం లేని హృదయంచేత దైవప్రేమచేతమనకాలాన్ని గడపటమే బ్రహ్మచర్యము.

హనుమంతుడు నిత్యబ్రహ్మచారి అంటున్నాం కాని అతనికి పెండ్లిఅయింది. 'శ్రీవత్సల' అనే ఆమె పెండ్లిచేసుకుంది. అయినప్పటికినీ అతడు బ్రహ్మచారి అనటంలో కారణంఏమిటి? నిరంతరము బ్రహ్మముతో చరించేవాడు కనుక బ్రహ్మచారి అన్నారు. నిరంతరము కూడను 'రామ రామ రామ రామ రామ' రోమరోమము రామనామమును స్మరిస్తూ ఉండటంచేత, అతడు బ్రహ్మచారి. చింతన, భావము, సంకల్పము, మన యొక్కపనులు మనసర్వమూ బ్రహ్మమునందే చరించాలి. ఏదిచేసినా, ఏదిచెప్పినా, ఏదిచూసినా దైవంగానే భావించుకోవాలి. కనుక బ్రహ్మచర్యమంటే దేహంతో కొన్నిరకములైన నిబంధనలు పాటించటమేకాదు. అది కూడా అవసరమే. వాటితోపాటు భావాన్నికూడను కొంత వరకు దానికి తగినట్లుగా మార్చుకోవటానికి, మలచు కోవటానికి ప్రయత్నంచేయాలి. ఇంక అహింస. హింస అనగా కేవలం ఒకజీవిని హింపించటంకాదు. మాటల చేత యితరులను బాధపెట్టకూడదు. కనుసైగల చేత ఇతరులను బాధపెట్టకూడదు. ఇంకేవిధంగా కూడను ఇతరులను బాధపెట్టకుండా చూచుకోవటం, ఇదిఅహింస. సహనమే అహింస, సహన శక్తి ఉండినప్పుడే మనం ఎంతైనా జీవితాన్నిరాణింప జేసుకోవచ్చు. అంతే కాదు, క్షమకూడా ఉంటుండాలి,

"క్షమ సత్యము, క్షమ ధర్మము
క్షమ వేదము, అహింస, క్షమయజ్ఞమగున్
క్షమ సంతోషము క్షమ దయ
క్షమ యాధారమగును-సర్వమునకున్" :

క్షమను అభివృద్ధిచేసుకున్నప్పుడు విద్యతోపాటు విన యవిధేయతలు కూడను అభివృద్ధి పొందుతాయి. తద్వారా మనజీవితము శోభాయమానంగా ఉంటుంది. జీవితములో విపిధపరిమలమధ్య సామరస్యము. సమ న్వయము ఉండినపుడే జీవితం శోభిస్తుంది. నిత్యసత్య ముగాప్రకాశించే ప్రాచీనసాంప్రదాయములను, సంస్కృతిని నేటికాలానుగుణముగా సమన్వయంచేసుకోవటానికి తగినప్రయత్నం చేయటమే చదువుయొక్క సరైన లక్ష్యం.

కనుక మనం చదువుతున్నామని పెద్ద పెద్ద డిగ్రీలు తీసుకొంటున్నామని మనం తృప్తి పడకూడదు ఆ డిగ్రీలతో పాటు మానవత్వాన్ని కూడా అభివృద్ధిగావించుకోటానికి తగిన ప్రయత్నం చేసుకోవాలి. ఈ మానవత్వాన్ని ఎంత అభివృద్ధి చేసుకుంటామో సమాజంకూడను, దేశంకూడనూ విశ్వంకూడను అంత అభివృద్ధి అయిపోయింది, ఈ నాడు కావలసినవన్నీ అభివృద్ధి చేసుకుంటున్నాం. ఒక్కొక్క డిపార్టుమెంటు లోపల ఒక్కొక్క నూతన పద్ధతిని develop చేస్తున్నాం. కాని, మానవత్వాన్ని మాత్రం తెలుసుకోవటం లేదు. ఆస్తి పాస్తులు పెంచుకుంటున్నాం దేహాన్ని, బంధు బలగాన్ని, సంపదను. సంతానాన్ని పెంచుకుంటున్నాము కానీ మానవత్వాన్ని పెంచుకోటానికి ప్రయత్నం ఎక్కడ కూడను చేయటంలేదు. మానవత్వం దివ్యమైన మార్గమందే, ఆధ్యాత్మిక మార్గమందే ఆత్మతత్త్వమందే దివ్యభావమునందే పెరుగుతుంది. విత్తనం మట్టిలో పెట్టి నీరుపోస్తే పెరుగుతుంది కాని ఒక tin లో పెట్టి నీరు పోస్తే కుళ్ళిపోతుంది. అదేవిధంగా మనం ఈ పవిత్రమైన నవత్వమును విశాలమైన దృక్పథం లో పెంచుకుంటూ రావాలి. ఇదే పవిత్రమైన విద్య, పవిత్రమైన తపస్సు, దివ్యత్వం. ఈ దివ్యత్వాన్ని విద్యార్థినులు దిన దినాభివృద్ధి చేసుకుంటూ. తర్వాత

విద్యతోపాటు వివేకాన్ని, వివేకంతోపాటు అనుభవాన్ని, ఈ రెండింటిద్వారా ఏర్పడిన దివ్యభావాన్ని సమాజము నందుంచి లోకకల్యాణమునకై దీనిని, వినియోగపరచి మీరుసార్థకమొంది దేశాన్ని, సమాజాన్ని పునరుద్ధరింప జేయటానకి తగిన ప్రయత్నం చేయ్యాలని నేను ఆశిస్తూ ఆశీర్వదిస్తూ విరమిస్తున్నాను.

మహిళాకళాశాల, అనంతపురం
17-2-80

# మితభాష హాయి

సత్యం పరమం తపః. సత్యముకంటె మించిన తపస్సు మరొకటి లేదు. శాంతం పరమం తపః సర్వభూతములయందు కారుణ్యము కలిగి, సమస్త జీవులయందుకూడను సంచరించే సత్య తత్త్వాన్ని నిర్మాణము సలుపుకుని సత్యమార్గమునందు ప్రవేశించిన వ్యక్తియే విద్యార్థి.

కారుణ్యం పరమం తపః. కరుణ అనే ఈశ్వర తత్త్వము సర్వభూతములయందు కూడ చైతన్యస్వరూపమై, దేదీప్యమానముగా వెలుగుతున్న సత్యాన్ని గుర్తించి సర్వజీవులయందుకూడనూ కారుణ్యము చూపడమే; ఇదియే శ్రుతియొక్క ప్రమాణము.

సూక్ష్మదృష్టితో మనము విచారించి చూచిన మానవునికంటే అతిక్రింద తరగతివైన మృగములయందు మనము అనేకవిషయములను గుర్తించడానికి వీలవుతుంది. మృగములైన ఏనుగ, గోవు, జింక, మొదలగు మృగములు పరమృగములను హింసించక, భక్షించక కేవలము పవిత్రమైన తృణ ధాన్యాదులే భుజించి సాత్త్విక జీవితాన్ని గడుపుతూ వస్తున్నవి. కనుకనే మానవునికంటె క్రిందజాతిలో జన్మించిన మృగములైనప్పటికినీ, ఈ ఏనుగు, గోవు, జింక, మొదలగు మృగములు మానవులచేత పూజింపబడుతూ వస్తున్నవి.

అదేమృగజాతియందు పులి, చిరుత, తోడేలు మొదలగు క్రూరమృగములు ఇతరమృగములను హింసించి భక్షించి, జీవించడంచేత మానవులు ఆ మృగములకు అతిదూరులై ఉంటున్నారు,

ఏతావాతా 'జంతూనాం నరజన్మ దుర్లభం.' మానవుడు ఈ జంతువులకంటే ఉత్కృష్టమైన వాడు, పవిత్రమైన వాడు. దివ్యమై, నవ్యమై, భవ్యమైనటువంటి మానవత్వములో ఈ క్రూరత్వమనేది ఉండటం ఇది మహాశ్చర్యకరమైన విషయం. దయ, ప్రేమ, ధర్మం, అహింసలతో అభివృద్ధి నొందిన మానవుడు నిర్దయ, క్రూరత్వము, కేవలం కఠినత్వము, కృతఘ్నతా హీనత మొదలగు దుర్గుణములు ప్రవేశించడంచేత అతనియందున్న సాత్త్వికమైన, పవిత్రమైన, దివ్యమైన భావములను తాను కోల్పోవుతూ వస్తున్నాడు.

ఆవులదొడ్డిలో పులియో, చిరుతయో, తోడేలో ప్రవేశించినప్పుడు ఈ ఆవులయొక్క గతి ఏపరిస్థితి

యందు ఉంటుంది? మహాహింసబడుతూ, క్రూరమైన జంతువులతో బాధింపబడుతూ కట్టకడపటికి ఆ క్రూర మృగములకు ఆహారంగా అగుచున్నవి. అదేవిధముగనే సాత్వికమైన గుణములు కలిగియున్న మానవుని యందు, పవిత్రహృదయము కలిగియున్న మానవుని యందు, దివ్యమైన హృదయము కలిగియున్న మానవునియందు, పులిలాంటి దుర్గుణములు, చిరుతలాంటి దుర్గుణములు, ప్రవేశించినపుడు కేవలము సాత్వికమైన దానిని భక్షించుటకు ప్రయత్నిస్తుంటారు; ప్రేమస్వరూపులైన విద్యార్థులారా! మానవహృదయము నిరంతరము పవిత్రమైన భావాలతో నిర్మలమైన ఊహలతో, నిస్వార్థమైన సేవాభావముతో నింపుకోవలసిన హృదయమునందు ఈ వయస్సులో దుర్భావములను ప్రవేశింపచేసుకుని, దుర్గుణములను చేర్చుకుని దుస్సంకల్పములను నిర్మించుకుని, తద్వారా మానవత్వాన్ని నిర్మూలం గావించుకొనుచున్నాము. ఇతరుల హృదయాన్ని బాధించుచున్నాము. ఇది కేవలము మానవులయొక్క సహజకృత్యములు కావు. నిజముగా పరజీవులయొక్క హింసనుగానీ, బాధనుగానీ, కష్టములు కానీ మనము గుర్తించుకోలేకపోతున్నామంటే మనము ఒక క్రూరత్వమైన స్థితిలో ఉంటున్నాము.

పరమ దుఃఖముతో ఉండిన మానవుడు, గ్రుడ్డివాడు బధిరుడు అటువంటివాని చెంతకు వెళ్ళి అనేక విధములుగా తన దుఃఖమును చెప్పుకుంటూ, రోదిస్తూ గుండెలు బాదుకుంటూ, తలను బాదుకుంటూన్నప్పటికినీ, ఈ అంధుడైన వాడికినీ, బధిరుడైనవానికి ఏ మాత్రమూ దయ కలుగదు. కారణమేమిటి? తన ఆవేదన వినే చెవులులేవు. రొమ్ములు కొట్టుకోవడము, తలను పగలుకొట్టుకోవడము, మొదలగు దృశ్యములు చూచే నేత్రములు లేవు. ఎన్ని విధముల తనదుఃఖముగానీ, ఆవేదనకానీ, తన బాధనుకానీ తెలుపుకొన్నప్పటికినీ, బధిరుడు, గ్రుడ్డివాడైన వాడు ఏ విధమైన జవాబునూ ఇచ్చుటకు పూనుకొనడు. అదే విధముగనే ఈ నాడు పరజీవుల బాధనుగానీ, పరజీవులహింసలుగానీ, అర్థము చేసికొనలేకున్నామంటే మనము నిజముగా గ్రుడ్డివారము, చెవిటివారమై ఉంటున్నాము. ఇతరులను హింసించడము, ఇతరులను బాధించడము ఇతరులకు ఏదో ఒక విధమైన అశాంతిని కల్పించడమే జీవితంగారూపొందుతూ వస్తున్నాము. తుచ్ఛభావములను మన హృదయములో చేర్చుకోవడంచేత, మనము పరుల హృదయమును ఏమాత్రమూ గుర్తించుకో లేకపోవడంచేత, అహంకార స్వార్థములచేత నిండిపోవడంచేత, మనము ఈ విధమైన కృత్యములకు పాల్పడుచున్నాము. అద్దమువలె హృదయమును తీర్చి దిద్దుకోవాలి. అద్దముయొక్క గుణమేమిటి? ఎదుటవస్తువుయొక్క ప్రతిబింబాన్ని తనలో నిరూపించే గుణమే: కాని శుద్ధమైన అద్దముగా మన హృదయము ఉండినప్పుడు ఎదుటవాని బాధకానీ, హింసగానీ, కష్టముకానీ, మన హృదయమనే అద్దములో చక్కగా ప్రతిబింబించడానికి అవకాశముంటుంది. ఎవరి హృదయమనే అద్దము దుర్గుణములతో మాలిన్యముతో నిండియుండునో అట్టివాని హృదయమునందు ఎదుటవ్యక్తి బాధలు కష్టములు, దుఃఖములు ప్రతిబింబించుటకు వీలుండదు. కనుక ఈ నాడు విద్యార్థులైన మీరు పరిశుద్ధమైన అద్దముగా మీ హృదయాన్ని తీర్చిదిద్దుకోవడం అత్యవసరము.

అప్పుడే సమాజముయొక్క బాధలు, దేశ కష్టనష్టములు, తల్లిదండ్రుల హింసలు మనం గుర్తించుకో డానికి వీలవుతుంది. మన యభివృద్ధి నిమిత్తమై మన తల్లిదండ్రులు ఎంతవరకు బాధపడుతున్నారు. అనే సత్యాన్ని గుర్తించుకోలేని మూర్ఖులుగా తయారవుతున్నాము. ఈ నాడు విద్యార్థులవల్ల సమా

జమునందెంత అల్లకల్లోల పరిస్థితి ఏర్పడుతున్నది. అనే సత్యాన్నికూడా గుర్తించుకోలేని విద్యార్థులుగా రూపొందుతున్నాము. భవిష్యత్తులో నాయకులుగా రూపొందింపబడు విద్యార్థులు ఈ నాడు దేశపరిస్థితిని కూడ కొంత గుర్తించాలి. ఈ నాడు మీరు తల్లి దండ్రుల పరిస్థితిని మీరు గుర్తించుకోలేక, దుర్గుణము లతో సమాజపరిస్థితిగానీ, దేశపరిస్థితిగానీ ఏరీతిగా తీర్చి దిద్దగలరు ? మీ యభివృద్ధి నిమిత్తమై మీ టీచర్స్‌గానీ, మీ 'వార్డన్స్' గానీ ఎంతబాధపడుతున్నారనే విషయాన్ని కూడ గుర్తించుకోలేని గ్రుడ్డివారుగా తయారవుతున్నారు. ఈనాడు పవిత్రమైన విద్యార్థులుగా రూపొందింపచేసి యావత్ దేశమునకు ఆదర్శవంతమైన విద్యార్థులుగా తయారుచేయాలని అనేక విధములైన లక్ష్యములను మనసునందుంచుకుని, పవిత్రమైనహృదయముతో ప్రేమ తత్త్వముతో మీనిమిత్తమై ప్రాకులాడుచున్న స్వామి తత్త్వాన్ని కూడ మీరు గుర్తించుకోలేకపోతున్నారు.

కేవలము 'విద్యః విద్య'. అనగా వ్రాయటము, చదవటము, తుచ్ఛమైన గ్రంథపరిచయములోనే మీ కాలము వ్యర్థము చేస్తున్నారు. ఈ పుస్తక పాండిత్య మంతా కేవలము పరోక్షమైన గాలము. కానీ ఈ నాటి ప్రపంచమునకు ప్రత్యక్షమైన అనుభూతులు అత్యవస రము. మీరు చదివే ఫిజిక్స్. కెమిస్ట్రీ, మాథమేటిక్స్, జూఅలజీ, మొదలగునవి కూడ మీ నిత్యజీవితములో తెల్లవారినది మొదలు సాయంకాలము వరకు ఉపయో గించుటకు వీలుకాదు. కెమిస్ట్రీ లేబరేటరీలోకి పోయి నప్పుడు ఏ ఏ పదార్థము, ఏ ఏ మెటీరియల్స్, ఏ విధంగా కలిపినప్పుడు ఏ పదార్థంగా రూపొందుతున్నాయి ? అనే విషయము ఆ క్లాసు 'టైము' లో మాత్రమే మీకు అర్థం అవుతుంది. కేవలము ఒకవిధమైన శాస్త్రాన్ని మనము తెలుసుకున్నంతమాత్రాన జీవితానికే మీ అనుభూతిగా ఉండేదికాదు. లేబరేటరీలోపల మనం 'ఆక్సిజన్' 'హైడ్రోజన్' రెండూచేరితే 'వాటర్' అవుతుంది అని తెలుసుకుంటాము. కానీ ఇంటిదగ్గర నీవు భోజనంచేసేసమయంలోపల 'హైడ్రో జన్', 'ఆక్సిజన్' రెండూకలుపుకుని త్రాగుతున్నావా ? లేదు. అక్కడ సహజసిద్ధమైన జలాన్ని నీవు గ్రోలు తున్నావు. మన నిత్యజీవితములో తెల్లవారినదిమొదలు రాత్రి పన్నెండు గంటలవరకును ఏది మన జీవితానికి అవసరము అనే 'కామన్‌సేన్స్', 'జనరల్‌నాలెడ్జి' నేర్చుకోవడం అత్యవసరంగా మనం ప్రయత్నించాలి. కనుక మన విద్య అనగా కేవలము గ్రంథపరిచయము మాత్రమేనని తెలుసుకోవడం కేవలం మూర్ఖత్వం.

కేవలము విద్య అనే ధనాన్ని సంపాదించుకుంటూ, శ్రమించి పనిచేసుకోకుండాపోతే ఆర్జించిన విద్యకానీ, జీవితంకానీ, నిరుపయోగం. మన విద్యార్థులు ఈ రకమైన విద్యను సంపాదించుటలో ప్రవేశించకూడదు. మొట్ట మొదట, మీరు పాసయిన తక్షణమే ఇంటికివెళ్ళి తల్లితండ్రులను గౌరవించి వాళ్ళ అభీష్టాన్ని నెరవేర్చ డానికి కంకణం కట్టుకోవాలి. తదుపరి సమాజములో ఏరకమైన సమస్యలున్నవో, నీగ్రామములో ఏవిధమైన సమస్యలుండునో సాధ్యమైనంతవరకు వాటియందు సేవచేయడానికి ప్రయత్నించాలి. నిజముగా స్వామి మిమ్మల్ని ఇన్నివిధముల పోషించి, ఇన్నివిధములుగా ఆదరించి, ఇన్నివిధములైన అనుకూలములుచేసినందుకు స్వామికి అందించవలసిన కృతజ్ఞత ఒకటి మాత్రమే! మీరు సమాజములోనికి వెళ్ళిన తరువాత మిమ్మల్ని చూచి ఈ సమాజపు జనులు "ఆహా. సత్యసాయికళా శాలలో చదివిన విద్యార్థి ఎంతచక్కగా ఉంటున్నాడు, ఎంత ఆదర్శవంతమైన జీవితం చేస్తున్నాడు. అని ఏ నాడు మిమ్మల్ని వర్ణిస్తారో, దానిని వినడమే మీరు నాకు చూపించే కృతజ్ఞత. అట్లు కాకుండా మన కళా శాల నుంచి బయటకుపోయి. వ్యర్థజీవుల వలె

తిరుగుతూ అప్రయత్నముగా కొన్నిరకములైన పెడ మార్గములో పడుతూ ఇష్టమువచ్చినట్లు వాగుతూ, ప్రశ్నలు వేస్తూ, కొన్నిరకములైన దుర్మార్గములలో చిక్కుకుంటే, నిజంగా మీరు భగవత్ద్రోహులనే చెప్ప వచ్చు.

అయితే నిజముగా మీరుమంచి డిసిప్లిన్ నేర్చు కున్నారంటే దేశనాయకులుగా తయారయి, మన భారత దేశమునే కాకుండా యావత్ ప్రపంచమును కూడ తీర్చిదిద్దగలరనే ధైర్యము, ఆనందము, ఉత్సాహం నాకు కల్గుతుంది. విద్యార్థులారా, నేను కోరే కోరికలు రెండు మూడు మాత్రమే. ఈ నాడు పిల్లలు చెడిపోవ డానికి మూలకారణము, అధికములగు మాటలతో కాలము వ్యర్థము చేయడమే. 'అతి భాష మతిహాని'. 'మితభాష అతిహాయి.' అధికంగా మాట్లాడటంచేత మీ ఎనర్జీ తగ్గిపోతుంది. మీ జ్ఞాపకశక్తి కూడ తగ్గిపోతుంది. ఇంతేకాదు, అతిభాష మిమ్మల్ని అగౌరవ పరుస్తుంది. కనుకనే మహర్షులు మౌనముగూర్చి చెప్తూ వచ్చారు. అనగా ఏమీ మాట్లాడకూడదనికాదు. సబ్జక్టుకు తగిన విధముగా మాట్లాడుకోండి. మీకు ఎంత అవసరమో అంతమాట్లాడుకోండి. అధికంగా మాట్లాడుకోవడం చేత చిన్నవయస్సులోనే మీ 'ఎనర్జీ' 'స్పాయిల్' (spoil) అయిపోతుంది. కానీ ఈ నాడు ఏమి చేస్తున్నారు పిల్లలు? సబ్జక్టులో బయలుదేరి ఆబ్జక్టులో చేరిపోతారు. ఎక్కడెక్కడికో దారీ డొంకా లేకుండా చేరిపోతున్నారు. కనుక నాకు ఇష్టమైనది ఏమిటంటే మిత భాష. అనవసరమైన విషయములో ప్రవేశించ కూడదు. మనము హాస్టల్‌నుంచి కాలేజికి వస్తు న్నాము. వచ్చేసమయంలో ఒంటరి, ఒంటరిగా రావటంచేత ఏమయిపోతున్నది? మన దృష్టిఇటువైపు అటువైపు పోవడము, ఎవరితోనో మాట్లాడటము, అన వసరమైన విషయములో ప్రవేశించడము, దాని వల్ల మన మనస్తత్త్వముకుడా మార్చుకోవడము ఈరకంగా జరుగుతున్నది, కనుక చక్కగా అందరూ లైనుగా కలిసివస్తే మాటలు ఉండవు. దృష్టిమారదు. ఈ విధంగా రావడంచేత దానిని పవిత్రమైన క్రమశిక్షణగా మనము రూపొందింప చేసుకోవచ్చు. మనము చిన్న చిన్న గుంపులుగా చేరి రాకూడదు. ఈ గుంపులు గాంగ్ లుగా మారిపోతున్నాయి. రూముల్లోకూడా గ్రూపులు గ్రూపులుగా మీరు చేరకూడదు. ఏదైనా ఒక సబ్జక్టుపై మాటలాడాలంటే ఆ సబ్జక్టు విషయం ఎంతవరకో అంతవరకే తర్కించుకోవాలి. అనవసరంగా బజార్లో తిరిగే కుక్కలువలె రూము రూముకు వెళ్ళే పిల్లులవలె విద్యార్థులు తయారు కాకూడదు. ఆ విధంగా తిరిగేవి కుక్కలు పిల్లులు మాత్రమే; కనుక మనం పిల్లి కుక్కలము కాము. పవిత్రమైన మానవులం. మనము ఈ నాడు "నేను మానవుడను" అనే సత్యాన్ని విం బెట్టుకుంటే అంతే చాలు. క్రొత్తగా చేరిన విద్యా ర్థులు పాత విద్యార్థులు స్వామి ఆశయాలను హృద యాలలో పెట్టుకుని సాధ్యమైనంతవరకు ఆదర్శమైన జీవితాన్ని నిరూపించి దేశాన్ని బాగుపరుస్తారని నేను ఆశిస్తూ ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

—విద్యార్థులకు భగవానునిదివ్యసందేశము
బృందావనము. 19-7-79

# శ్రీ సత్యసాయి అధ్యయన సంస్థ

డాక్టర్ ఎన్. ఎస్. లక్ష్మణరావు, ప్రొఫెసర్, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సు, బెంగుళూరు.

సాయి ప్రభావం.

పరమపూజ్యులయిన భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి ఆశీర్వాదములను ఆశిస్తూ ఈ వ్యాసాన్ని ప్రారంభిస్తున్నాను. నామనస్సులోని కొన్నిభావాలను చదువరులకు విన్నవించడానికి సాహసిస్తున్నాను. మొట్ట మొదట నేను ఏవిధంగా భగవాన్ బాబా వారి భక్తుడనయినానో తెలుపుతాను. స్వామివారి కోటానుకోట్ల భక్తులలో నేనోక అల్ప భక్తపరమాణువును. సుమారు మూడు దశాబ్దములనుండి నేను అధ్యాపకునిగానూ, పరిశోధకునిగానూ పనిచేస్తున్నాను. కేవలము ఆరు మాసాల క్రితమే నాకు స్వామి సాన్నిధ్యమూ, దర్శన స్పర్శన సంభాషణ భాగ్యములూ లభించినవి. భగవానుల సాన్నిధ్యమునందు పొందిన పరమానందమును నేనింత వరకూ నాజీవితములో ఎప్పుడుకూడా అనుభవించి యుండలేదు. శ్రీ యుతులు ఎన్. కస్తూరి, హవర్డ్ మర్ఫెట్ వ్రాసిన పుస్తకాలు పది సంవత్సరాల నుండి చదువుతున్నాను. వారి ఉత్తమ గ్రంధాలు నాలో గోప్ప మార్పును తెచ్చినాయి, కానీ ఈ మధ్యనే నాకు స్వామి వారి దర్శన భాగ్యము లభించినది. దాదాపు పదిహేను సంవత్సరాల క్రితము స్వామి మల్లేశ్వరములోవి ఒక పాఠశాలలో వేలకొలది భక్తులను ఆశీర్వదించుట చూచినాను. అప్పుడు ఒక క్షణకాలము మాత్రమే స్వామి వారి దివ్యమంగళ మూర్తిని చూడగలిగినాను. తరువాత సుమారు ఎనిమిది సంవత్సరాల క్రింద పరీక్షల పనిమీద అనంతపురం వెళ్లవలసి వచ్చింది. అనంతపురంలో ఉన్నపుడు పుట్టపర్తికి పోవలయుననే గాఢవాంఛ కలిగింది. కానీ కొందరు మిత్రులు స్వామి పుట్టపర్తిలో లేరని చెప్పినారు. నేను పుట్టపర్తికి వెళ్లడం మానుకొన్నాను. ఇటువంటి కారణాంతరాల వలన నేను బాబావారి దర్శనము చేసుకోలేక పోయినాను.

1979 జూలై మాసాంతములోనో ఆగష్టు మాస ప్రారంభములోనో నేను నా మిత్రుడూ, సహాధ్యాపకుడూ అయిన ప్రొఫెసర్ ఏ. వీ. కృష్ణమూర్తిగారి ఇంటికి నా స్కూటర్ మీదవెళ్లినాను. అయన ఇంటిలోకి ప్రవేశించగనే కొన్ని పెద్దపెద్ద భగవాన్ బాబావారి ఫోటోలు కనిపించినాయి. ఆ ఛాయా చిత్రాల దివ్యసౌందర్యం నాదృష్టిని ఆకర్షించినాయి. "మీరు బాబావారి భక్తులా?" అని నేను కృష్ణమూర్తిగారిని ప్రశ్నించినాను. ఔనని చెప్పినారు. తరువాత కొంత సేపు స్వామిని గురించి ముచ్చటించుకొన్నాము. ఆ మాటల సందర్భంలో బాబావారి దర్శనభాగ్యము కోసము నేను వేచియున్నానని చెప్పినాను. బహుశః భగవానుని దివ్యకాంతిని సందర్శించే సమయము ఇన్నాళ్లకు వచ్చింది.

నా కుతూహలాన్ని గమనించి కృష్ణమూర్తిగారు శ్రీ సత్యసాయి అధ్యయన సంస్థ (Sri Sathya Sai Study Circle) ను గురించి వివరించినారు. ఈ అధ్యయన సంస్థ కార్యక్రమాలలో పాల్గొనుమని ప్రోత్సహించినారు. నేను చేయగలిగిన స్వల్పసేవను చేయడానికి సంసిద్ధుడనని చెప్పినాను. నేను 1947

నుండి 1951 వరకు బెంగుళూరు ఇంజనీరింగు కళాశాలలో చదివినాను. ఆరోజుల్లో నేను బసవనగుడిలోని రామకృష్ణ ఆశ్రమంలో ఉండేవాడిని. అక్కడ నేను అలవరచుకొన్న మానసికక్రమశిక్షణ నాకు ఇప్పుడు ఉపయోగపడుతున్నది.

తరువాత కొంతకాలానికి నాకుమరొక అపూర్వమైన సదవకాశం లభించింది. మా సంస్థకు చెందిన కొంతమంది సభ్యులము కుటుంబసమేతము 150 మంది పుట్టపర్తికి వెళ్లగలిగినాము. 1979వ సంవత్సరం అగష్టు 11 మరియు 12 తేదీలు మాకు చిరస్మరణీయమైనవి. ఆరెండు రోజులను మాలో ఎవ్వరూ మరచిపోలేరు. స్వామి రెండు దివ్యోపన్యాసాలను అనుగ్రహించినారు. ఒక్కొక్క పర్యాయము దాదాపు రెండు గంటల సేపు ఉపన్యసించినారు. రామకృష్ణమఠము లోని ఆధ్యాత్మికతత్త్వవేత్తల ఉపన్యాసాలు ఇంతకు ముందు ఎన్నోవిన్నాను కానీ బాబావారి ఉపన్యాసాలతో వాటిని పోల్చలేము. స్వామి ఉపన్యాసాలు నామీద వెదజల్లిన ప్రభావాన్ని నేను వర్ణించలేను. అవినాలో ఒక గొప్ప మార్పును కలుగచేసినాయి. నేను ఎన్నడూ అనుభవించని అద్వితీయమయిన ఆనందాన్నిపొందినాను. తరువాత బాబావారు అపారమైన ప్రేమతో దివ్య విభూతిని సృష్టించి ఇచ్చినారు. నేను నిజముగా తన్మయత్వాన్ని పొందినాను. నేను మామూలు స్థితిలోనికి రావడానికి కొంతసేపు పట్టింది. ఇంతలో స్వామి అమితమైన దయతో నన్ను పలుకరించినారు. నీవు ఏదయినా రెండు మాటలు మాట్లాడు అని స్వామి చెప్పినారు. ఇటువంటి గౌరవము నాకు కలుగుతుందని నేను ఎప్పుడూ ఊహించి ఉండలేదు. పైగా ఏమి మాట్లాడవలయునో నాకుతోచలేదు. కానీ మాట్లాడక తప్పదు. స్వామి ఆజ్ఞను పాటించవలయును. ఏదో ఒక విధంగా ధైర్యము తెచ్చుకొని కొన్ని మాటలు మాట్లాడగలిగినాను: ''స్వామి ! మేమందరమూ సామాన్యమయిన ఉపాధ్యాయులము. స్వామి సమక్షంలో మేము ఉపన్యసించడానికి రాలేదు. స్వామి ప్రబోధలు వినడానికి వచ్చినాము. స్వామి గురువులకెల్ల గురువు, జగద్గురువు. మాకు మీరు తరణోపాయాన్ని బోధింప వలయును. నాకు ఈ సదవకాశాన్ని ఇచ్చినందుకు స్వామికి కృతజ్ఞతాభివందనములు'' అని విరమించుకొన్నాను. ఈ వాటికి కూడా నేను ఈ ప్రథమసన్నివేశాన్ని మరచిపోలేను. అప్పటినుండి స్వామి ప్రబోధలయందు నా భక్తిప్రపత్తులు హెచ్చినవి. బాబావారి దివ్యప్రభావము వలన మన విద్యావిధానములో అన్ని ఘట్టాలలో మార్పులు రావలయును. ఈ ప్రశాంతపరిణామములో స్వామి సూత్రధారుడు. మనవంటి అధ్యాపకులు పాత్రధారులుగా వ్యవహరించవలయును.

## వివేకానందుని భావాలు

స్వామి వివేకానందుడు భారతదేశమునందు జన్మించిన మహాపురుషులలోనొకడు. ఆయన విద్యను గురించి విద్యావిధానాన్నిగురించి పేర్కొనిన అభిప్రాయాలు నేటికినీ ఆచరణయోగ్యములు. ఆయన అమూల్యమైన భావాలు చిరస్మరణీయములు. 1979వ సంవత్సరం అగష్టు నెలలో నేను పనిచేస్తున్న ఇన్‌స్టిట్యూటులోని నూతన పట్టభద్రులకు ఒక అభివందనోపన్యాసాన్ని ఇచ్చినాను. అప్పుడు నేను విశదీకరించిన విషయాలను మరల ఇప్పుడు పునశ్చరణ చేస్తున్నాను. స్వామి వివేకానందుని ప్రబోధలు నేటికినీ ఆచరణీయమయినవి. కనుక వాటిని ఈ క్రింది పేరాలలో పొందుపరచినాను.

"........మన విద్యార్థులు అభ్యసించుచున్న విద్య నిర్మాణాత్మకమయినదికాదు. ప్రస్తుత విద్యావిధానంలో కొంత మంచి ఉంది. కానీ అనేక కొరతలున్నాయి.

మంచి కంటే చెడ్డ ఎక్కువ. ఈ విద్యావిధానంలో ఒక గొప్పలోపం ఉంది. ఇది నిజమైన మానవులనూ, మానవత్వాన్నీ సృష్టించే విద్యకాదు. దీనిలో నిర్మాణాత్మకమైన కార్యక్రమం లేదు. మనదేశంలో అనేక మహాపురుషులు జన్మించినారనే సంగతిని విస్మరింపచేస్తున్నాము. నిర్మాణాత్మకమయిన భావాలకు దోహదం కల్పించడం లేదు విద్య అంటే కేవలము విషయ సంగ్రహణ కాదు. అనేక అనవసరమయిన విషయాలతో బుఱ్ఱను నింపుకొనుటకాదు. ఈ విధంగా అసంబద్ధమయిన విషయాలు విద్యార్థికి మానసిక అజీర్ణమును కలిగిస్తాయి. విద్యార్థికి నిర్మాణాత్మకమయిన విషయాలను నేర్పించాలి. అవి జీవితానికీ, మానవత్వానికీ, సౌశీల్యానికీ సంబంధించి ఉండవలయును. నీవు కేవలము గ్రంథాలు చదివితే లాభంలేదు. ఒక గొప్ప గ్రంథాలయంలోని పుస్తకాలన్నీ చదివినందువలన ఉపయోగంలేదు. జీవితానికి ఉపయుక్తమయిన సూత్రాలను అర్థంచేసుకొని, జీర్ణించికొని నీ వ్యక్తిత్వాన్ని పటిష్టం చెసుకుంటే చాలును. బహుళ గ్రంథ పరిచయము వలన మాత్రమే జీవితము నిర్మాణాత్మకము కాజాలదు. విద్య అంటే విషయసేకరణకాదు. అదే నిజమని భావిస్తే గ్రంథాలయాలే సర్వజ్ఞులు; విజ్ఞాన సర్వస్వ గ్రంథాలే ఋషులు.

నీ కన్నులు తెరచిచూడు. సస్యశ్యామలమయిన భారతదేశంలోని ప్రజానీకం ఆకలితో అలమటిస్తున్నారు వారి ఆర్తనాదాలు వినిపించటంలేదు? నీ విద్య ఆహారోత్పత్తికి పనికి వస్తుందా? ఈ కొరతను తీర్చగలదా? సామాన్యప్రజలకు జీవితసంగ్రామంలో ఉపకరించని విద్య, విద్యకాదు. మనుష్యుల శీలాన్ని అభివృద్ధిపరచని విద్య, విద్యకాదు. విద్య మానవుల దయా ధర్మాలనూ, ధైర్యసాహసాలను అభివృద్ధి పరచవలయును. ఇటువంటి ఉన్నతమయిన ఆశయాలను పెంపొందించ లేని విద్య నిరర్థకము.

విద్య శీలమును అభివృద్ధి పఱచవలయును. మనోబలమును హెచ్చింపవలయును. బుద్ధిని వికసింపజేయవలయును. స్వశక్తిని, స్వయంపోషకత్వమును ఇవ్వవలయును. విదేశీయుల వ్యాఖ్యానాల మీద ఆధారపడకుండ మనదేశమునందలి ప్రాచీనజ్ఞానమును అభివృద్ధిపరచవలయును. ఆంగ్లభాషను కూడా నేర్చుకొనవలయును. పాశ్చాత్యవిజ్ఞానమును అభ్యసించవలయును. సాంకేతిక విజ్ఞానమునకు ప్రాముఖ్యతనిచ్చి పరిశ్రమలను స్థాపించవలయును. మన ప్రజలు సేవావృత్తిని అవలంబించక స్వయంకృషితో కష్టపడి ధనమువార్జించి ధర్మార్థకామమోక్షములను సాధింపవలయును.

ఇనుపకండరాలు, ఉక్కునరాలు, ఎదురులేని వజ్ర సంకల్పమున్న మానవులు, విశ్వాంతరాళాన్ని పరిశోధింపగల దీక్ష కలిగిన ప్రజలు; సాగరగర్భానికి పోగలిగిన సాహసవంతులు; మృత్యువునకు భయపడని వీరులు—ఇట్టివారిని తయారుచేసే విద్యావిధానాన్ని రూపొందించవలయును. మనకు మానవత్వముకల మానవులను తయారుచేసే విద్యావిధానం కావాలి. మానవత్వాన్ని పెంపొందించే సిద్ధాంతాలు కావాలి. సమన్వయ సంపన్నులయిన పౌరులను సృష్టించే విద్యా విధానంకావాలి.''

శ్రీ సత్యసాయి అధ్యయన సంస్థ ఏమిచేయవలయును!

ప్రతి విద్యాసంస్థలోనూ అధ్యయన సంఘాలు ఉండవలయును ఇవి ఒక కేంద్రీయ అధ్యయన సంస్థకు అనుబంధముగా ఉండవలయును. వీటికి సంబంధించిన సమస్యలను వర్గీకరించి, ఒక్కొక్క సమస్యను ప్రత్యేక

ముగా పరిష్కరించవలయును. ఉదాహరణకు: వీటిని విద్యాస్థాయిని బట్టి వర్గీకరించవచ్చును : (1) ప్రాథమిక విద్య (2) మాధ్యమిక విద్య (3) ఉన్నత విద్య (4) కళాశాల విద్య (5) విశ్వవిద్యాలయ విద్య (6) మ్యానేజ్‌మెంట్ విద్య (7) విద్యానిర్వహణశాఖ (8) వైజ్ఞానిక ప్రయోగశాలలు (9) పరిశ్రమలు (10) ఇతర సంస్థలు. ఇవి పట్టణములకు, గ్రామములకు సంబంధించి ఉండవలయును. క్రింద పేర్కొనబడిన విషయాలను గమనించవలయును.

1. ఉపాధ్యాయునికినీ విద్యార్థికినీ గల సంబంధము.
2. ఉపాధ్యాయునికినీ మరొక ఉపాధ్యాయునికినీ గల సంబంధము.
3. ఒక విద్యార్థి మరొక విద్యార్థికినీ గల సంబంధము.
4. ఉపాధ్యాయ వర్గము, విద్యార్థిబృందము, అధికార వర్గము రెండు రకములు: ప్రభుత్వము, ప్రైవేటు, సంస్థలు
5. పాఠ్యప్రణాళికల అభివృద్ధి — వివిధ బోధనావిషయముల ప్రకారము వర్గీకరింపవలయును.
6. విద్యార్థుల మనస్సులను ఉత్తేజపరచునట్లు బోధించుట
7. నిర్మాణాత్మక మానసిక వికాసము గల విద్యార్థులను గుర్తించి వారి శక్తులను అభివృద్ధి పరచుట.
8. సామాన్య లౌకిక విద్యతోబాటు నైతిక విద్యను సమన్వయపరచుటకు — భగవద్గీత, బైబిలు, కొరాను మున్నగు మతగ్రంథములనుండి కొన్ని పాఠ్యభాగములను బోధించుట.
9. ఆధ్యాత్మికజ్ఞానము మరియు భారతీయ సంస్కృతిని బోధించుటకు ప్రత్యేక తరగతులు నియమించుట — రామాయణ, మహాభారతములవంటి ఉద్గ్రంథములను పఠింప చేయుట
10. గ్రామీణపాఠశాలలను దర్శించి తగిన సలహాలనిచ్చుట — వారి సమస్యలను పరిష్కరించుట — బోధనకు కావలసిన సౌకర్యములను సమకూర్చుట
11. బోధనా ప్రక్రియలను అభివృద్ధి చేయుట
12. చక్కని పాఠ్యగ్రంథములను తయారు చేయుట
13. వివిధ బోధనావిషయములలో నిపుణులు తయారు చేసిన Lecture Notes పాఠశాలకు, కళాశాలలకు సరఫరా చేయుట.
14. విద్యాలయముల ఆవరణలను పరిశుభ్రముగా నుంచుట — దైవత్వమునకును పరిశుభ్రతకును గల అవినాభావ సంబంధమును బోధించుట.
15. ప్రార్థనతో దినచర్యను ప్రారంభించుట — చిన్న చిన్న ప్రార్థనా పుస్తకములను సమకూర్చుట (ప్రార్థనలు అర్థసహితముగా నుండవలయును)
16. బోధింపవలసిన విషయములు, వాటిని బోధించుటకు ఉపయోగింపబడు ఉపాయములు, వీటికి గల సంబంధము. మంచిని సాధించుటకు మంచి పద్ధతులనే ఉపయోగింప వలయును. మంచిని చెడ్డతో సాధించలేము.
17. ఇతరులను గౌరవించుటవలన ఆత్మగౌరవము కలుగును — తోటి మానవులను ప్రేమించవలయును. — తల్లిదండ్రులను, పెద్దలను, విద్యావంతులను గౌరవించవలయును.
18. సేవ, త్యాగము — వీని ఆవశ్యకత.
19. సత్య, ధర్మ, శాంతి, ప్రేమలు — ఇవి సర్వమత సారాంశము.
20. త్రికరణశుద్ధి కలిగియుండుట — మనము ఆచరించని విషయాలను ఇతరులకు బోధించకూడదు.

21. "నా జీవితమే నా సందేశము" అని స్వామి చెప్పినారు. ప్రతి వ్యక్తి తన జీవితాన్ని స్వామి ప్రబోధలననుసరించి తీర్చి దిద్దుకొనవలయును.

ఇంతకంటే పెద్ద జాబితాను తయారు చేయవచ్చును. ఈ విషయాలు అందరికీ తెలిసినవే; తెలియని విషయాలేవీ లేవు. మొట్టమొదట ప్రతివ్యక్తీ ఈ సూత్రాలను తన వృత్తిలో, తన జీవితములో, తన దైనిక కార్యకలాపములో అన్వయించవలయును. ఈ దీక్షలో అనేక కష్ట నష్టాలకు గురికావలసివస్తుంది. కానీ వెనుకంజ వేయకూడదు. అనేకులు విమర్శించవచ్చును. ఆదిలో కొన్ని ఇబ్బందులు కలుగవచ్చును. కానీ చివరకు సత్యమే జయించును. ఈ ఉత్తమ ఆశయాలు నెరవేరడానికి కొందరు స్త్రీలు పురుషులు తమ జీవితాలను అంకితము చేయవలయును.

కానీ ఒక ముఖ్యవిషయాన్ని మనము గుర్తించుకొనవలయును. అన్ని సమస్యలనూ ఒకే సారి పరిష్కరించడానికి పూనుకొన కూడదు. విద్యావిధానమును మార్పుచేయు కార్యక్రమాలను చాలా జాగ్రత్తగా నిర్ణయించవలయును. అనేక దశాబ్దాలనుండి మన విద్యావిధానంలో పేరుకొనిన బూజును దులపడం చాలా కష్టం. క్రొత్త సంస్కరణలు అమలుపరచడానికి అమితమైన సాహసము, పట్టుదల, భక్తి శ్రద్ధలు, చిత్తశుద్ధి, మరియు కార్యదీక్ష అత్యవసరం. చివరకు తప్పకుండా మన కార్యంలో విజయాన్ని సాధించగలము. మన ప్రయత్నాలలో నిరాశ నిస్పృహ అధైర్యము ఉండకూడదు. భగవానుని కృపవలన మనలను ఆవరించిన అంధకారం పటాపంచలయిపోతుంది. ఎటువంటి క్లిష్టమైన పరిస్థితులలోగూడా మనము నిరాశ చెందగూడదు.

చిత్రకారుడు తన కళాకృతిని ఒకే పర్యాయం సృష్టించడు. మొట్టమొదట చిత్రముయొక్క పరిధిని నిర్ణయించుకొని మిగిలిన వివరాలను ఊహించుకొని చిత్రనిర్మాణానికి ఉపక్రమిస్తాడు. అట్లాగే మనము కూడా మన విద్యావిధానసంస్కరణకార్యక్రమాన్ని కొనసాగించాలి. అప్పుడే మార్గంలో గగనసీమలో ఆశా జ్యోతులు వెలుగుతున్నాయి.

సింహావలోకనం

విద్యారంగంలో అధ్యాపకునిగానూ పరిశోధకునిగాను సుమారు మూడు దశాబ్దాలనుండి కృషి చేస్తున్నాను. మన దేశంలో స్వామి వివేకానందుని ఆశయాలు నెరవేరడానికి తగిన వాతావరణాన్ని కల్పించగలమని నా గాఢవిశ్వాసము. అట్లాగే భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి గొప్ప ఆశయాలు త్వరలో ఫలించగలవు. మనము సరిఅయిన విధానాన్ని అవలంబించినచో విద్యారంగములో ఒక నూతనశకం ప్రారంభం కాగలదు. "లేవండి. మేలుకోండి. నడవండి. గమ్యస్థానాన్ని చేరుకొనేవరకు ఆగవద్దండి." అన్నారు స్వామి వివేకానంద.

విద్యారంగంలో పరిణామాలు మనదేశంలో ప్రారంభమయి ప్రపంచమంతటా విస్తరించవలయును. ఒక నవోదయం ప్రారంభం కావలయును. మన కార్యక్రమంలో స్వామివారి అనుగ్రహము, సలహాల కోసం మనము భక్తి ప్రపత్తులతో ప్రార్థించవలయును. ఈ సందిగ్ధసమయంలో బాబా వారి బోధనలే మనకు శరణ్యం. మన విద్యావిధానం బాగుపడాలంటే మనం స్వామి చూపిన మార్గాన్ని అనుసరించవలయును.

పరమ పూజ్యులయిన భగవాన్ బాబావారి పర్యవేక్షణ క్రింద మన అధ్యయన సంస్థ దినదినాభివృద్ధి చెందగలదని నా గట్టి నమ్మకము. స్వదేశీయ, అంతర్జాతీయ విద్యారంగములో ఈ సంఘము నవోదయానికి నాంది కాగలదు.

అనువాదకుడు: బి. శ్రీనివాసమూర్తి

# పదార్థములోని దోషము

ఎద్ది లేదనుచుంటిమో అద్దికలదు ।
ఎద్ది కలదనుచుంటిమో అద్ది లేదు ।
ఉన్నదొక్కటె, దైవంబు ఎన్నటికినీ.
లేనిదయ్యేను, విశ్వంబు కానయ్య.

యత్ దృశ్యం తన్నశ్యం: కనిపించే ప్రతిపదార్థము కూడనూ కాలగర్భములో అంతమొందుచున్నది. నామ రూపాత్మకమైన ఈ జగత్తునందు నిత్యశాంతిని పొంద గోరి మానవుడు అనేకప్రయత్నములకు, అనేక సాధనలకు గురి అవుచున్నాడు. నిత్యసత్యమైన ఆత్మ తత్వాన్ని దృశ్యకల్పితమైన జగత్తునందు వెతుకుటకు ప్రయత్నిస్తున్నాడు. సత్యము శాంతి, జగత్తునందు కలదా? లేక తనయందు ఉన్నదా? అనేసత్యాన్ని గుర్తించుకో లేక పోతున్నాడు మానవుడు. దృశ్యమును బహిర్ముఖము గావించుకున్నంతకాలమూ దృశ్యమే గోచరిస్తుంది కానీ దృక్ అనేటువంటి సత్యతత్వము గోచరించుటకువీలుకాదు.

కేవలము ఈ మాలను చూచునంతవరకు పుష్పములు మాత్రమే మనకు తెలుస్తుంది కానీ ఇందులో ఆధారమైన దారము గోచరించదు. పైన కనుపించే పుష్పములయందు పరిశోధనలు సలిపినప్పుడే, ఏ ఆధారము చేత ఈపుష్పములు నిలువగలిగినవి అనే విచారణశక్తిని పెంపొందించుకుని పరిశోధనలు చేసినప్పుడే. కొంత వరకు అవ్యక్తమైన దారము వ్యక్తమౌతుంది. అదే విధముగనే ఈ దృశ్యకల్పితమైన జగత్తునందు లక్ష్యమును ఇమిడ్చి, ఇందులో సుఖశాంతులు లభిస్తాయని ఒక దురాశకు లోనై నిర్వికల్పమైన తత్వాన్ని దూరం గావించుకుంటున్నాము. దృశ్యకల్పితమైన జగత్తు మానవునికి క్షణకాలసుఖమును అందిస్తున్నది. సంపదలన్నియు కూడను మించుమెరుపువలె క్షణభంగురమై చంచలత్వమును పొందుచున్నవి. బంధు మిత్రాదులందరూ కనులముందే కాయమును విసర్జించిపోవుచున్నారు ఈ దృశ్యకల్పితము అందించే ఆనందము క్షణానందము. శాశ్వతానందము కోల్పోవడానికి తగిన మార్గమును అవలంబిస్తున్నాము.

ఇంతియేకాదు. దృష్టిని అంతర్ముఖము గావించుకోవడం వల్లనే నిజమైన ఆనందం లభించును, అనే సత్యాన్ని కూడా విస్మరిస్తున్నాము. ఇది భారతీయులైన వారందరికినీ ప్రత్యక్షప్రమాణము. శివదేవాలయములో శివునిముందు నంది ఉండటం మనందరికీ అనుభవమే. రామమందిరము వెళ్ళినప్పుడు హనుమంతుడు రామదర్శనమునిమిత్తమై తనఎదురుగా నిల్చున్నదృశ్యము మనకు గోచరిస్తుంటుంది. విష్ణుమందిరము పోయినప్పుడు గరుడ విష్ణువు యొక్క సన్నిధియందు అతిభక్తితో వినయవిధేయతలతో తాను ఆజ్ఞాబద్ధుడై ఉంటుంటాడు. కనుకనే హనుమంతుని, గరుడను, నందిని, భారతీయులు పూజించడము మనయొక్క ఆచారరూపకంగా అలవర్చుకుంటూ వస్తున్నాము. కారణమేమిటి? ఆ నంది, ఆ గరుడ, ఆ హనుమంతుడు బహిర్దృష్టి లేక కేవలము ఈశ్వరదృష్టియందే తమ చిత్తములను అంకితం గావించుకోవడం చేత, బహిర్ముఖమునకు విరుద్ధమైనటువంటి దృష్టిని అమర్చుకోవడంచేత, మరల్చు

కోవడం చేతనే, వారు పూజనీయులుగా రూపొందుతూ వచ్చారు.

కనుక మనదృష్టిని భగవత్ అభిముఖం గావించు కున్నపుడే మనము పవిత్రమైన మార్గమును అవలంబించిన వారమవుతాము. కానీ సర్వసామాన్యముగా ప్రతి మానవుడు తనదృష్టిని బహిర్ముఖము నందే అభివృద్ధి గావించుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

లోకములో జ్ఞానము, భోగము రెండు స్థితులు మాత్రమే ఉంటున్నవి. ఏ కొంతమంది మాత్రమో జ్ఞానదృష్టిచేత దివ్యమైన ఆత్మతత్త్వాన్ని అనుభవిస్తూ ఉంటారు; అధికభాగము భోగదృష్టిచేతనే తమ జీవితమును నిరర్థకం గావించుకొంటుంటారు. కానీ భోగమువల్ల కలిగే ఫలితం ఏమిటి? ఈ సుఖసంపదవల్ల వచ్చే ఆనందము ఏమిటి? బహిర్దృష్టివల్ల లభించిన సంతోషం ఏమిటి? ఇవి క్రమక్రమేణా మానవత్వాన్ని మరపించి కేవలం పశుత్వంలో ప్రవేశపెట్టి, దివ్యత్వాన్ని దూరం గావించేటువంటివే! దృశ్యకల్పితమైన పదార్థమునందున్న దోషమును మనము ఏమాత్రమూ గుర్తించక దానిని మరుగుపరచే ప్రయత్నమునకు సంసిద్ధుల మవుతున్నాము. నిజముగా పదార్థమునందున్న దోషమునే గుర్తించిన ఆ పదార్థమును నిరర్జించుటకు మనము ఎంతైనా ప్రయత్నిస్తాము. ఒక సర్పమే కనిపించినప్పుడు ఈ సర్పమునందు విషలక్షణమున్నది, దోషమున్నది అని గుర్తించిన వ్యక్తి ఆ సర్పమునకు అతిదూరమైపోతాడు. ఒక పులిని మనం చూసినప్పుడు పులిలో ఒక క్రూరమైన గుణము ఉన్నదని తెలుసుకున్నప్పుడు అతిదూరంగా ఉండుటకు ప్రయత్నిస్తాము. ఇదే విధముగా ప్రతి వస్తువు యందున్న దోషములను మనం గుర్తించినప్పుడు, ఆ వస్తువులలో మనకు సులభముగా, అప్రయత్నముగా వైరాగ్యము సంభవిస్తుంది. జగత్తునందున్న ప్రతి పదార్థమునందు కూడనూ అనిత్యము. అనే దోషము, అంతర్భూతమై ఉంటున్నది.

అంతియేకాదు, నిరంతరమూ మార్పుచెందే రోగము కూడా ఈ పదార్థమునందుంటున్నది. కనుక మార్పు చెందే పదార్థము, మార్పు చెందే వ్యక్తికి, మార్పు చెందని ఫలితమును ఏ మాత్రమూ అందించదు. మానవుడు ఎంత అవివేకిగా ప్రవర్తిస్తున్నాడు అనేది కూడా ఇందులో మనకు అర్థమవుతుంది. సుఖమును అందించే పదార్థమూ అనిత్యమే. అందుకొనే వ్యక్తి అనిత్యమే. ఈ ఇరువురూ అనిత్యమైనపుడు ఈ సుఖమును నిత్యమైన సుఖముగా ఎట్లుభావిస్తున్నారో, ఇది అర్థం కావడంలేదు. సత్యమైన సుఖమును, సత్యమైన పదార్థమే అందించును. నిత్యమైన పదార్థమే నిత్యసుఖాన్ని అందించును.

కనుక ఈ సత్యనిత్యమైన పదార్థము ఆత్మ ఒక్కటియే. ఈ ఆత్మతత్త్వాన్ని గుర్తించడానికి మనము తగిన ప్రయత్నము చేయడం లేదు. మనము గాఢముగా ప్రయత్నము చేసినప్పుడు ఆత్మతత్త్వాన్నే కాకుండా, ఆత్మానందాన్ని కూడ అనుభవించుటకు అవకాశముండును.

—శ్రీ వారి బోధ, ప్రశాంతినిలయము.

25-9-79.

# హెచ్చరిక—మరొక పర్యాయము

అమాయకులైన ప్రజల భక్తి విశ్వాసములను దుర్వినియోగపరచి, వివిధ వేషాలతో వారినుంచి ఆతిథ్యము ఆరాధన ఆదరణ కానుకలు ధనసంపాదన మొదలగు లాభములను పొందే మోసగాండ్ర సంఖ్య ఇంకనూ తగ్గలేదు. ఇట్టివారికి శ్రీ వారితో ప్రత్యక్షముగానూ పరోక్షముగానూ సన్నిహితత్వము కలదని శ్రీ వారి భక్తులెవరూ నమ్మరు; అయిననూ; ఈ సత్యము తెలియని వాళ్లమధ్య వీళ్లుసంచరించి ఏజంట్ల ప్రచారమువలన, ధన సంగ్రహణ చేయుచున్నారు, తాము ఆడేమాటలంతా స్వామివారి ఆదేశానుసారము అని నమ్మించి, మోసగించి ఇంటర్వ్యూలు కూడ ఇచ్చుచున్నారు : సాయి సురేశ్, సాయిబాలా, సాయిరమేశ్ (కర్ణాటక) సాయి మీరా, సాయిదాస్ అనే పేర్లు పెట్టుకుని శ్రీ వారే తమరిని దీనికై అనుగ్రహించినట్లు ప్రకటించుచున్నారు. భక్తులు తమ కార్యక్షేత్రములందున్న ఇట్టి కపటవ్యక్తులను కనిపెట్టి, ఇతరులను హెచ్చరించవలసినదిగా మనవి చేస్తున్నాము. ఇట్టివారిని ఆదరించే భక్తులకు శ్రీ సత్యసాయి సేవా సంస్థలో స్థానముండదు.

## పుస్తకములు

| | పేరు | వెల | తపాల ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుతమూర్తి—(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం—అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | ఆత్మారామం | 5-00 | 0-45 |
| 3. | ఆధ్యాత్మికదీపిక | 2-50 | 0-20 |
| 4. | గీతావాహిని | 3-50 | 0-25 |
| 5. | జ్ఞానవాహిని | 1-00 | 0-10 |
| 6. | ధర్మవాహిని | 1-25 | 0-15 |
| 7. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 8. | ప్రశాంతివాహిని | 1-00 | 0-15 |
| 9. | ప్రేమవాహిని | 1-00 | 0-15 |
| 10. | భాగవతవాహిని | 3-00 | 0-25 |
| 11. | మణిమాల | 2-00 | 0-20 |
| 12. | వచనామృతము (2) | 2-50 | 0-30 |
| 13. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-35 |
| 14. | సత్యం శివం సుందరం (2) | 7-00 | 0-35 |
| 15. | సత్యం శివం సుందరం(3) | 5-00 | 0-35 |
| 16. | సందేహనివారిణి | 2-00 | 0-20 |
| 17. | సూక్తిరసతరంగిణి (ఉప్పాల రాజారావు) | 2-00 | 0-25 |
| 18. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (1) (ఉప్పాల రాజారావు) | 3-00 | 0-35 |
| 19. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (2) (ఉప్పాల రాజారావు) | 2-00 | 0-25 |
| 20. | సువర్ణసుమమాల | 5-00 | 0-30 |
| 21. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |
| 22. | శ్రీ సత్యసాయివచనామృతము(3) | 2-00 | 0-20 |
| 23. | శ్రీ సత్యసాయిదివ్యబోధ | 2-00 | 0-20 |

కర్ణాటక రాజ్యపు బెంగుళూరు—67, బృందావనములోని 'వ్రజ్ బృందావన్ ప్రెస్' నందు పి. చంగ్లకోటిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, "శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్" ప్రశాంతి నిలయము, తరఫున ప్రచురింపబడినది. ఎడిటర్: యన్. కస్తూరి. యం. యే., బి. యల్.

# శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, ప్రశాంతినిలయము,

పత్రికలు — పుస్తకములకు ఆర్డర్లు.

A (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువకానీ చందాలు స్వీకరింపబడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 5 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | | 12 |
| యూరప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏభాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలయును. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రస్సు నందు మార్పు అవసరమని తెలుపు సమయము నందును చందా నంబరును వ్రాసి పంపవలయును.

B (1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు. ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్డ్ ఛార్జీ రూ 2-25 లు మీ ఆర్డరుతో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డరులోనే తెలుపవలయును.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకొనవలెనన్న మీ చిరునామాగల స్టాంపు వేసిన కవరును పంపవలయును.

(5) పుస్తకముల ఆర్డరులు—విదేశములనుంచి తపాల ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతినిలయము. అనంతపురం జిల్లా ఆంధ్ర ప్రదేశ్-పిన్:515134, యొక్క చిరునామాకే పంపవలయును. మనియార్డర్ పంపువారు వెనుకభాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలయును.

(పుస్తకసూచి 144వ పుటలో చూడండి)

సువిశాలజ్ఞానతత్వమును గుర్తించలేని, జీవితముయొక్క అంతరాంతరాలలో ప్రవేశించలేని, నేటిమానవలోకము విశ్వశ్రేయస్సును ఏవిధంగా సాధించగలదు? విశ్వశ్రేయస్సు సమాజముపై ఆధారపడియున్నది. సమాజముయొక్క క్షేమము వ్యక్తిపై ఆధారపడియున్నది. వ్యక్తి, శాంతివచనములు పలుకుతూ, అశాంతికర్మలు ఆచరించే ఆత్మవంచకుడుగా తయారౌతున్నాడు. కళ్ళున్న గ్రుడ్డివారివలె, చెవులున్న చెవిటివారివలె, మతియున్న ఉన్మత్తులవలె, ప్రవర్తించే నేటిమానవులకు, నిత్యజీవితమును శోభింపజేసే ఆధ్యాత్మికతత్వబోధ, దానిపై విశ్వాసము అత్యవసరము. వివిధపరిధుల మధ్య సానుభూతిసమన్వయము సమరసము అభివృద్ధికావాలి. దీనికి వ్యక్తి, తనతత్త్వము, తనఅంతస్తు, తనశక్తిని విచారణద్వారా తెలిసికోవలెను.

—బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64